నని యీమె చెప్పెను. ఆమాటలు బ్రాహ్మణుఁడు విని యోసి వెట్టి చేరుకునూవులకు దంచిననూవు లెవ్వరుగయిన నిత్తురా యీమె యీలాగునఁ దెచ్చి యిచ్చుట కేమయిన నిమిత్త ముండును గాఁబట్టి నీ వానూవులు పుచ్చుకొనకు మని చెప్పెను. ఆలాగున నే యీమూషికమున కింతబలిమి యు నిక్కడిసదా వాసమును నిమిత్తము లేక సంభవింపవు.

అని వీణాకర్ణుఁడు చెప్పఁగా విని చూడాకర్ణుఁడు తడవ్రులఁబట్టి యీయెలుక యిక్కడ నొకలాఁగ త్రావు చేసికొని విడువక వాసము చేయుచున్నది. ఇట్లు వసించుటకు నిమిత్తము తెలిసినది కాదు. త్రవ్వి చూచెదఁ గాక యని చెప్పి యొక గుద్దలితో నేను వసించువివరము త్రవ్వి చిరకాలోపార్జిత మయిననాధనము సర్వము గ్రహించెను. తరువాత సత్త్వోత్సాహములు లేక నానాఁ డాహారము సయితము సంపాదించుకొనఁ జాలక దిగులుపడి కృశించి మెల్లమెల్లగా సంచరించుచుండఁగాఁ జూచి చూడాకర్ణుఁ డిట్లనియె. ధనము గలవాఁడే బలవంతుఁడు. ధనముగలవాఁడే పండితుఁడు. ధనము సర్వశ్రేయములకు నిదానము. ధనము లేనివానిజీవన మేల? ఈమూషికము తన ధనము కోలుపోయి కదా తొంటిజవసత్త్వము లుడిగి స్వజాతిసామ్యమును బొందెను. అర్థపరిహీనునకు నిరంతరము ఖేదము సంభవించును. నిరంతరఖేదమువలన బుద్ధిహీనత్వము ప్రాప్తించును. బుద్ధిహీనతవలన సమస్తకార్యములు నిదాఘనదీపూరములట్లు వినాశము నొందును. ధనవంతున కే పౌరుషమును మేధాసంపత్తియు బంధుమిత్రులు ను గలుగుదురు. పుత్త్రమిత్రవిరహితునిగృహము ను మూర్ఖునిచిత్తము

ను శోకాస్పదము. దారిద్ర్యము సర్వశూన్యము. దారిద్ర్యము కంటె మరణము మేలు. మరణ మాపాతయాతనావహము. దారిద్ర్యము యావజ్జీవము తీవ్రవేదనాకరము. ఇంద్రియములు నామము బుద్ధి వచోధోరణిని బురుషుఁడు తొంటివాఁ డయ్యు ధనముల బాసినక్షణమున నే లాఁతివాఁ డగును. ఇది మహాచిత్రము. అని యాపరివ్రాజకునకు చెప్పఁగా విని మక్కలి శిష్యుఁడయి యిట్లు చింతించితిని. ఇఁక నాకిక్కడ వసింపఁ దగదు. ఇప్పుడు నావృత్తాంతము పరులతోఁ జెప్ప రాలును యుక్తము గాదు. అర్థనాశము మనస్తాపము గృహా ముదలిదుశ్చరిత్రము వంచనము పరాభవము ను బ్రకాశింపఁ జేయఁ దగదని పెద్దలు చెప్పుదురు. దైవానుకూల్యము లేక పౌరుషము చెడినప్పుడు మానవంతునకు వనవాసమునం బలె సుఖము లేదు. కుసుమస్తబకమువలె మానవంతుఁడు సర్వజ నులమూర్ధములమీఁదనయిన నుండవలె. లేదా వనమందు సమసి పోవలె. ఇక్కడ నే వాసము చేసికొని యాచనతో జీవించెద నంటేనా దానికంటె గర్హితము లేదు. ఒక్క ముక్కడిని యాచించుటకంటె నిప్పులోఁ బడి శరీరము తొలఁగుట మేలు. అనృత మాడుటకంటె మౌనము మేలు. పరధనాప హారణముకంటెఁ దిరియుట మంచిది. విశేషహీనుఁడగు ప్రభుని సేవించుటకంటె వనవాసము ఉత్తమము. యాచించి కొని బ్రదుకుటకంటె మరణము శ్రేయము. సేవావృత్తి మానమును వలె యాచకావృత్తి సమస్తగౌరవమును హరించును. ఒకరియిల్లు కాచి వారు పెట్టునదే గొని దోసిలి యొగ్గి యునికి యము యిక్కలి సందర్భము. అని నానావిధముల విచా

రించియు లోభము త్రిప్పలకు లోనయి మరల నర్థసంగ్రహము చేయవలెనని తలంచి యచ్చోట నే నిలిచితిని. లోభము మోహమును బుట్టించును. మోహము దుఃఖము నుత్పాదించును. దుఃఖము జ్వలనమువలె స్వాశ్రయమునకు నాశము పుట్టించును. కాఁబట్టి లోభమునకు బుద్ధిమంతుఁడు లోఁబడఁడు. తరువాత నేనక్కడ వదలకుండుట చూచి చూడాకర్ణుఁడు నన్నుఁ గఱ్ఱతో విసిరి వేసెను. ఆ వ్రేటు దైవవశమువలనఁ దప్పిపోయినది. తగిలి యుండెనా నా యింతికి యమలోకములోఁ బాతకాఁపనయి యుండనా? అనంతర మిట్లు చింతించితిని. ఆహా, ధనలోభము సర్వాపదలకు మూలము గదా! తద్వర్జనముకంటె లోకమందు సుఖ మేదియు లేదు. ఆశ దిగనాడిన వాఁడే సత్పురుషుఁడు. వాఁడే సర్వశాస్త్రములు చదివినవాఁడు. వాఁడే సర్వధర్మము లాచరించినవాఁడు. ఉదరమునకయి పరుల గోఁజక ప్రాప్తలాభమునకు సంతోషించువాఁ డొక్కఁడు లోకమందు ధన్యుఁడు. వాఁడే సుఖి. తత్తత్కార్యానురూపముగా దేహికి దుఃఖములట్లు సుఖములు కోరకయే ప్రాప్తించుచున్నవి. అందులకయి ప్రయాసపాటు నిరర్థకము. ఈ త్రావు తాతముత్తాతలు సంపాదించినకాణాచి గాదు. భూమండలములో నింకఁ ద్రావు దొరకదా? ఇక్కడ నుండ నేల? ఈ చెడగరవు బోడకఱ్ఱమోఁదులు వడి ప్రాణములు కోలుపో నేల? ఇంక నెక్కడ నయిన నొక్కవిజనప్రదేశము చేరి కాలము పుచ్చుట మంచిది. శిలాంతరాళమందలి కప్పను భరించుదయామయుఁ డయిన యీశ్వరుండు నన్నుఁ గాపాడ కుండునా? అని చింతించి మనసు గట్టిపఱుచుకొని యచ్చోటు విడిచి యానిర్జ

నవనము చేరితిని. వనములోఁ గాయగసురులు భక్షించి పడియు నీరు త్రాగి యొకచెట్టునీడలో వసించి కాలము పుచ్చుట మంచిది గాని ధనహీనుఁడయి నలుగురిలో నుండ రాదు. అనంతరము నాపుణ్యమువలన నాకీమిత్రుఁడు లభించెను. నా మహాభాగ్యమువలన నే నిప్పుడు నీయాశ్రయ మనుష్వాప్తము దొరకినది. సత్సంగతికంటె లోకమందు మే లేదియు లేదు. సంసారవిషవృక్షమునకు రెండు ఫలము లమృతతుల్యములు. కావ్యామృతరసపాన మొకటి సజ్జనసంగతి యొకటి. అనిన విని మంథరుఁ డిట్లనియె.

అర్థములు నిత్యములు గావు. యౌవనము ఝరీవేగ తుల్యము. జీవనము బుద్బుదప్రాయము. కాఁబట్టి బుద్ధిమంతుఁడు సత్వరముగా ధర్మము సమాచరింప వలెను. సమాచరింపనివాఁడు పశ్చాత్తాపముఁ బొంది శోకాగ్నిసంతప్తుఁ డగును. నీ వతిసంచయము చేసితివి. దానిదోష మిది. తటాకోదరజలములకుఁ బరీవాహమువలె సమార్జితవిత్తములకుఁ ద్యాగమే రక్షణము. ధనము పాఁతలో దాఁపరికము చేయుట దాని వినాశమునకు దారి చేయుట గాని వేఱు గాదు. వాయి కట్టి కడుపు కట్టి ధనము గడించువాఁడు పరుల కయి మోపు మోచువానియట్లు క్లేశమునకు మాత్రము పాత్రము. భోగత్యాగములకు వినియోగింపనిధన ముండుటవలన ఫల మేమి? పోకడవలన హాని యేమి? లోభి ధనికుఁ డయ్యు భోగవిరహముచే దరిద్రునితో సమానుఁడే. అయినను లోభికి ధనార్జనరక్షణహానులయందు దుఃఖ మొక్కటి విశేషము. లోభి తన ధనము పేదలకుఁ బెట్టఁడు. చుట్టములకు వినియోగింపఁడు.

తాను౦ గుడువఁడు. కడపట నేలపాలో దొంగలపాలో చేయుచున్నాఁడు. ప్రియవచనములతోడిదానము గర్వరహితము గాని జ్ఞానము క్షమాసహిత మయిన శౌర్యము త్యాగయుక్త మయినవిత్త మనియెడునాలుగు లోకమందు దుర్లభములు. బుద్ధిమంతునకు సర్వదా ధనార్జన మావశ్యకకార్యమే కాని యతిసంచయేచ్ఛ తగదు. తొల్లియొక్క జంబుకము లోభముచేత మిక్కిలివస్తున్నలు సంగ్రహింపఁ గోరి వింటిదెబ్బవడి చచ్చెను. వినుము ని కాకథ చెప్పెదను.

కల్యాణకటక మనుపట్టణమందు భైరవుఁ డను వ్యాధుఁడు గలఁడు. వాఁడొకనాఁడు వేఁటకయి సింగాణి తూపులు వల యురులు చిక్కములోనగుసాధనములు పూని వింధ్యాటవికిఁ బోయెను. అక్కడ వాఁడొకవది కావించుకొని మచ్చునెట్టి పొంచి యుండి యొకపోతరించినమృగము నేసి చంపి యెత్తి యటుకడఁ బెట్టుకొని వచ్చుచుండఁగా నడగొండవలె నొకపంది కానఁబడెను. అంతట నామృగయుఁడు నా భాగ్యమువలన మాంసాంతరము సయితము దొరకెన దని సంతోషించి యామృగమును నేల డించి వి ల్లెక్కువెట్టి బాణము సంధించి సూకరము నేసెను. ఏటు వడి యాక్షణమె యావరాహము క్రోధదోదిత మయి శరవేగమున ఘుర్ఘురించుచుఁ బాటి వచ్చి కొమ్ములను వానిఁ గొట్టెను. వాఁడు మొదలు నటి కనతరువువలె నేలఁ గూలి యొలుచుఁ బ్రాణములు విడిచెను. పంది యు మృతిఁబొందెను. అక్కడ నొక్కసర్పము కిరాత వరాహములత్రొక్కుడులఁ బడి మడిసెను. అంత నొకనక్క దీర్ఘరావ మనునది యాహారార్థము వనములోఁ గ్రుమ్మరుచు

నక్కడికి వచ్చి చచ్చి పడి యున్నసర్పకిరాతవరాహములను జూచి నాకు భోజనము పుష్కలము గాఁ దొరికిన దని సంతోషించి యిట్లు చింతించె. నాకు మూఁడునెలల గ్రాసమునకు పనిమాంసము చాలును. ఒక్క మాసము కిరాతునిమాంసముతోఁ గడపవచ్చును. మృగసూకరముల మాంసముతో రెండుమాసములు జరుపవచ్చును. ఒకదినమున పాము చాలును. తొలి యాఁకలి యిప్పటి విల్లునారిచర్మముతోఁ దీర్చుకొనియెద గాక యని చింతించి చేరువకుఁ బోయి గొయము పంట నొక్క కొఱికెఁగా నే బెట్టువగిలి గనయము పట్టు ఱొమ్మునఁ దాఁకెను. ఆ దెబ్బతో నయ్యనక్క నేలఁ గూలి దొర్లుచు విలవిలఁ దన్నుకొనుచుఁ జచ్చెను. చూడు లోభము ఎట్టి నేదశకుఁ దెచ్చినది!

కాఁబట్టి యతి సంచయేచ్ఛ తగ దని చెప్పితిని. ఒరుల కిచ్చి తాను భుజించిన దే తనసొత్తు. పరుల కీక తాను గుప్పక కూడఁబెట్టిన ద్రవ్యము చచ్చినతరి వెంట రాఁబోదు. అని చెప్పి హిరణ్యకుని మఱి యిట్లనియె. మించిపోయినదా యిప్పుడు త్రవ్వగా నేల పోనిమ్ము. బుద్ధిమంతులు గానిదాని కెన్నఁడు కోరరు. పోయినదానికై వగవరు. విపత్తు వచ్చిన నప్పుడు వితాకుపడరు. కాఁబట్టి మిత్రుఁడా! సదా నీ వుత్సాహముతో నుండుము. శాస్త్రములు చదివియు మూర్ఖులయి యున్నవా రెంద అున్నారు. పురుషుఁడెవ్వఁడు క్రియావంతుఁడో వాఁడు విద్వాంసుఁడు. రోగుల కౌషధము పేరు చెప్పినమాత్రమున రోగశాంతి గాఁ బోదు. వివేకహీనునికి శాస్త్రజ్ఞానము గ్రుడ్డివానికి స్వహస్తదీపము వలె నిష్ఫలము.

చూతుము విపత్తువచ్చినప్పుడు నాకు ఖేదము లేదు. సంపద వచ్చినప్పుడు మోదము లేదు. దేహి కాపత్సంపదలు పర్యాయమున రాకడ సహజము. అర్థములు నిత్యములు గా వని యెఱునెఱుక గల వాఁడు తన్నాశమునకు వగవఁడు. అర్థము లేకున్నను ధీరునకు లోకమందు మాన్యత కొఱతవడదు. పుష్కలము గా ధనము గలిగి యున్నను క్షుద్రునకు గారవము రాఁ బోదు. సింహమునకుఁ గలిగిన నైసర్గికతేజము శ్వానమునకు నూఱుబంగారుసొమ్ములు వెట్టిన రాదు. నీవు బుద్ధిమంతుఁడవు నీగారవమున కిప్పుడు హాని యేమి? ఏలాగున నైనఁ బుట్టించినవాఁ డాహారము కల్పింపక పోఁడు. చూడు జంతువు గర్భమునుండి నేల జాఱఁగా నే తల్లిఱొమ్ము చేఁపుచున్నది. కాఁబట్టి జీవనార్థము మిక్కిలి యాయాసంపాటు సయితము వ్యర్థము. నీవు సకలధర్మములు తెలిసినవాఁడవు. నీకు విస్తరించి చెప్పఁ బని లేదు. నీకు లఘుపతనకుఁ డొకఁడు నే నొకఁడను గాము. మనలను మూవురను దైవ మొక్కచోటఁ జేర్చెను. దొరకినంతటితోఁ గాలము గడపుకొని సుఖముగా జీవింతము. అనిన హిరణ్యకుఁడు మిక్కిలి సంతోషించి యిట్లనియె.

మంథరా! నీవచనామృతము వర్షించి నాదురంతతాపము నివారించితివి. నేను ధన్యుఁడ నయితిని. "మిత్రలాభమనులాభసంపద" యనువచనము నేఁడు నాకు లక్ష్యసమన్వితమయ్యెను.

ఎవ్వఁడు హంసములను శుకములను మయూరములను శుక్లహరిత చిత్రములఁ గావించె నాయీశ్వరుఁ డాయి

జంతువులకుఁ దత్తదనురూప మయినవృత్తిని గల్పించువాఁడు. మూఢు లీయర్థ మెఱుఁగక వృత్తికయి పడరానిపాట్లు పడికాలము వ్యర్థముగాఁ బోఁగొట్టుచున్నారు. విత్తము గడనయం దొకదుఃఖము కాఁపుదలయం దొకదుఃఖము వినాశమం దొకదుఃఖము పుట్టించుచున్నది. ఇట్లు దుఃఖైక మూల మయిన విత్తమేల? కాల్వనా? ధర్మార్థము ధనము గోరుటకంటె నిస్పృహత్వము మంచిది. "అనుసు త్రొక్క నేల కాలుగడుగ నేల." ఆకాశమునందుఁ బక్షులచేత భూమియందు వ్యాళములచేత జలములయందు మీలచేత మాంసము భక్షింపఁబడినట్లు సర్వత్ర విత్తవంతుఁడు భక్షింపఁబడియెడును. కాఁబట్టి ధనతృష్ణ మానిపోలు వివేకకార్యము. తృష్ణ యొకటి మానెనా యావల దరిద్రుఁ డెవఁడు ధనికుఁ డెవఁడు. దాని కెవ్వఁ డెడ మిచ్చును వానిపూర్థ మే దాస్యమునకు సింహాసనము. నీసన్నికర్ష ప్రభావముచేత నాయజ్ఞానము సర్వము నివర్తించినది. కృతార్థుఁడ నయితిని. నిరంతరముగా నీతోడి సంగతికంటె నాకు లాభ మొకటిలేదు. నీతోడి ప్రణయమున నొక్కకొఱఁతయు రాఁబోదు. ప్రణయము లామరణాంతములు, కోపములు తత్క్షణభంగురములు, త్యాగములు నిశ్శంకములు, నగుట మహాత్ములకు సహజము. అని పలికిన మంధరుఁ డాపలుకులు విని మిగుల సంతోషించి హిరణ్యకలఘుపతనకులుం దానును యథేచ్ఛవిహారములఁ గాలక్షేపము చేయుచు సుఖముగా నుండెను.

తరువాత నొకనాఁడు మంధరాదులు మువ్వురు సల్లాపములు సలుపుచుం బ్రొద్దు పుచ్చుచుండఁగా నొకమృగము

మృగయునిచేఁ దఱుమఁబడి బెదరి మహావేగముతో నక్కడికిఁ బాఱి వచ్చెను. అది చూచి భయపడి కూర్మము జలములోఁ బ్రవేశించెను. మూషికము లొఁగం జొచ్చెను. వాయస మెగిరి వృక్షాగ్ర మెక్కెను. అనంతరము ప్రాణిమీఁద నుండి కాకము నిక్కి నలుదిక్కులు చూచి చూపుమేర దూరములో భయహేతు వేదియు లేమి నిశ్చయించుకొని మంథర హిరణ్యకులను బిలిచి మీరు వెఱవకుఁడు. చుట్టుపట్టు మిక్కిలి దూరము చూచితిని. భయమునకు నిమిత్త మేదియు నాకంటఁబడ లేదు ; అని చెప్పఁగా నే కచ్ఛపమూషికములు జల బిలములు వెడలి వచ్చెను. లఘుపతనకము ను వాని చేరువ వ్రాలెను. అంత మంథరుఁడు భయపడి వడవడ వడంకు చున్న జింకను జూచి నీ వెవ్వఁడవు నీ వేల పాఱివచ్చితి వని యడిగిన మృగము పక్క లెగయ రొఁజుచు నిట్లనియె. నా పేరు చిత్రాంగుఁడు. నన్ను వేఁటకాఁ డొకఁడు తఱుముకొని వచ్చెను. వానికి భయపడి పాఱి వచ్చితిని. వాఁడు నాపరుగు పట్టఁ జాలక వెనుకఁ జిక్కినాఁడు. మీకు నేను శరణాగతుఁడను. సర్వదానములు సర్వవ్రతములు సర్వయాగములు శరణాగతరక్షణముతో సరిగావు. శరణాగతు నుపేక్షించుటకంటె గురితము లే దని ధర్మజ్ఞులు చెప్పుదురు. మీరు సకలధర్మవేత్త లని బుద్ధిమంతులు చెప్పఁ గా విని యున్నవాఁడను. మనసు కలఁత పడియుండుటవలన నిది చెప్పఁదగినమాట యిది చెప్పఁగూడని మాట యని తెలియఁగక యే మో చెప్పినాఁడను. మీకు ధర్మములు చెప్పుపాటివాఁడను గాను నావాగ్దోషము క్షమించి నన్ను రక్షింపుఁడు. మీతోమైత్రి సంపాదించుకొని

యిక్కడ వసించి కాలము గడపవలె నని నాకోరిక. మాబంధువులను మాదేశమును విడిచి వచ్చితిని. మీమఱుఁగు చొచ్చితిని. మీరిఁక నన్నుఁ బాలముంచెద రో నీట ముంచెద రో మీభారము. అనిన విని మంథరుఁ డిట్లనియె. చిత్రాంగా! నీవు బుద్ధిమంతుఁడవు సాధుడవు నీతోడిసఖ్య మవశ్యము మాకపేక్షణీయము. దీని కింతదూరము చెప్పఁ బని లేదు. ఈతావు నీ యిల్లు గా నెంచుకొని మాతోఁ గూడి యథేచ్ఛము గా వర్తించుచు సుఖము గా నుండుము. అని చెప్పఁ గా మృగము మిగుల సంతోషించి యావనమందు లేఁబచ్చికజొంపములు మేయుచు మడుఁగులోని నీరు త్రావుచు జేరువ మ్రానినీడలోఁ బండుకొనుచు నిట్లు చిరకాలము సుఖము గా వసించెను.

అంతట నొకనాఁడు మృగము మేఁతకుఁ బోయి తొల్లిటివలె వేళకు వచ్చి త్రావు చేరమికి మిక్కిలి చింతపడి మంథరుఁడు లఘుపతనకహిరణ్యకులతో నిట్లనియె మన చెలికాఁడు చిత్రాంగుఁ డింతమసలుటకు నిమిత్త మేమి? ఎన్నఁడు గాని యింతదడవు రాక నిలిచినవాఁడు కాఁడు. అక్కడక్కడ మేఁతకుఁ బోయినశకుంతసంతానములు కొఱఁకులు మాని యిరవులకు రాఁ దొడఁగె. వ్రేలు తమతమపసులకదుపులను దోలుకొని పల్లియలకుఁ బోవుచున్నవారు. సూర్యుఁడు ప్రతీచీముఖము నందు సిందూరతిలకమునందము వహించుచున్నవాఁడు. తరణికిరణవారము చల్లారఁజల్లారి నాకారాటము పెల్లు మీఱుచున్నది. కొంతదూరము పోయి వెదకి వచ్చెద నంటి నా నాకు గమనవేగము లేదు. మిమ్ముఁ బంపితి నా మీఁది మిక్కిలి మీరు మరలి వచ్చి నాకంటఁ బడునందాఁక నాచి

త్తము తత్తరపడుచుండును. నే నేమి చేయుదు నని కన్నీరు నించి దిక్కులు చూచు చూరకుండ లఘుపతనకుఁ డిట్లనియె. నాకు నెల్లపక్షులకంటె జవాతిశయము గలదు. బహుయోజనము లయినను క్షణమాత్రములోఁ గ్రుమ్మరి మరలి రా నోపుదు. దానిఁ బట్టి యే కదా లఘుపతనకుఁ డని యన్వర్థ సంజ్ఞఁ బడసి యున్నాఁడను. నీవు కొందలపడకుము. నే నిక్కడ నున్నట్టే యెంచుకొనుము. ఇదిగో నిమిషమాత్రాన వెదకి వచ్చి చిత్రాంగునివృత్తాంతము చెప్పెద నని పలికి యా క్షణమె యెగిరి పోయి యారణ్యము నానా ప్రదేశములు వెదకి యొక్క వో నురులలోఁ జిక్కుపడి యున్న చిత్రాంగునిఁ జూచి కన్నుల నీరు పెట్టుకొని చేరం బోయి చెలికాఁడా, నీవు పరులసొమ్మునకు కాశపడవు. పరులను బాధింపఁ బోవు. అడవి లోనిగడ్డి మేసి పడియ నీరు త్రాగి యొకచెట్టునీడలోఁ బడి యుండి ప్రొద్దుఁబుత్తువు. నీ వొక్కరిఁకను నేఁత యెఱుఁగవు. నివంటిసాధువు కా యిట్టియాపద రావలె? ఇంతదూరము చింతింప నేల? యెంతవారికిఁ గాని దైవ మలంఘ్యము. ప్రాప్తించినవ్యసనము నకుఁ బ్రతికారము విచారింప వలెఁ గాని ఱిచ్చవడి యుండఁ దగదు. కాఁబట్టి యిప్పుడు కర్తవ్యము నీకుఁ దోఁచినది శీఘ్రముగాఁ జెప్పుము. మంథరహిరణ్యకులు నామార్గము చూచుచుందురు. పోవలెను అనినఁ జిత్రాంగుఁడు విని వేఁటకాఁడు రాకముందు హెచ్చరికపడి సదుపాయము చేసితి రా నన్నుఁ దప్పింప వచ్చును లేదా నాయాశ నేటితో మానుండు. ఇప్పుడు పోయి వేగిరము హిరణ్యకునిఁ దోడుకొని రమ్ము. అతఁడు వచ్చెనా నాకట్లు తెగఁ గొఱికి నన్ను రక్షింపఁ

జాలుదు. అని చెప్పఁగా నే లఘుపతనకుఁడు మహావేగముతో నెగిరి పోయి యీవృత్తాంతము మంథరహిరణ్యకులతోఁ జెప్పి హిరణ్యకునివంక చూచి మనము కడుశీఘ్రముగాఁ బోవలెను. నీవు నావేగము ననుసరించి గాఁ జాలవు. ఇంతలో నేమి కాను న్నదో తెలియదు నావీఁపెక్కుము. నిమిషములోఁ గొని పోయి విడిచెద నని చెప్పి యొడంబరించి హిరణ్యకుని దనవీఁపుమీఁద నెక్కించుకొని తెంగుమనుఱెక్కల మ్రోఁతతో బాణము వలెఁ బోయి చిత్రాంగునిదాఁపున వ్రాలెను. అంతట హిరణ్యకుఁడు చిత్రాంగునిబంధములు త్రెగఁ గొఱికి చెలి కాఁడా! నీవు బుద్ధిమంతుఁడవు వియురులలో నెట్లు చిక్కితి వని యడిగెను. లఘుపతనకుఁ డదివిని యిట్లనియె. మన మిక్కడ నిలువ రాదు. ముందు ముచ్చట లాడుకో వచ్చును. లేలెం డని పలికి పయనము చేసి తాను వారికి మీఁద దాఁపుగా గగనమార్గమందు వచ్చుచుండెను. అప్పుడు చిత్రాంగుఁడు హిరణ్యకున కిట్లనియె. ఎట్టిబుద్ధిమంతునకుఁ గాని యెట్టి బుద్ధి హీనునకుఁ గాని దుఃఖమో సుఖమో యేకాలమం దేది యనుభవింప వలెనో యది యనుభవింపక తీరదు. ప్రాణులకు సుఖదుఃఖములు సహజములు. నాపూర్వకర్మ మెట్టిదో పలు మాఱిట్టి యాపదల కే పాలయితిని.

ఆఱునెలల ప్రాయమప్పుడు నేను మాజాతిమృగములతోఁ గూడి సంచరించుచుండఁగా నొకనాఁడు వేఁటకాఁడు వచ్చి యురులు పన్ని మంచిపచ్చికఁ దెచ్చి ముచ్చు వెట్టి కొంతదూ రానఁ బొదమాటునఁ గూర్చుండి చూచుచుండెను. అంతట నేను బాల్యచాపలముచేతఁ బదువు విడచి ముందు పేరెము

వాలుచుఁ జివుచివుక్కునఁ జవుకళించి దాఁటుచుఁ జని మమ్ముఁ జూచి మేయఁ బోయి యురులలోఁ దగులుకొని భయపడి కూఁతఁ బెట్టితిని. అంతట మాపదువుమృగము లన్ని తల లెత్తి చెవులు ఱిక్కించి నిక్కి చూచి బెదరి "చట్రాతిమీఁదఁ గొట్టినకుండపెంచికలవలెఁ" చెదరి నలువలఁకులకుఁ బాఱి పోయెను. అనంతరము వేఁటకాఁడు పొదమాటు విడిచి నాదాపునకు వచ్చెను. నేను మృగమను. శిశువను. మాపదువుఁ బాసితిని. బంధములోఁ జిక్కుకొంటిని. దాపున యమునివలె వేఁటకానిఁ జూచితిని. ఇంక నేమి చెప్పవలె. నా ప్రాణము ముక్కాలుమువ్వీసము పోయిన దను. పిమ్మట వాఁడు నా యొద్దఁ గూర్చుండి యొకదారము నామెడకుఁ గట్టి పట్టుకొని నాకు నొవకుండ నురి విడిపించెను. కొంతాయు వున్నది కాఁబట్టి నన్నుఁ జంపఁ గడఁగినవాఁడు కాఁడు. తరువాత నన్ను వాఁ డఱకడం బెట్టుకొని పోయి యాదేశ మేలుచున్న రాజకుమారునికి నూడిదగా నిచ్చెను. ఆరాచకొమారుఁడు తమ సాహిణమున కెదురుఁగొట్టములోఁ గట్టఁ బంచి నాకాహారదానాదికృత్యములు తఱి తప్పక జరుపుట కచ్చటి సేవకులకుఁ గట్టడ చేసి నాయందు ముద్దుచేయ నానాఁడు నన్ను విచారించుకొనుచుండెను. అంత దినక్రమమున బెదరు విడిచి మనుష్యులతో మచ్చికపడితిని కాఁబట్టి కాచువాండ్రు నన్ను రాచకొమారునియనుమతిని గట్టు వదల్చి తిరుగ విడిచిరి. నేను మెడ బంగారుజంగెలు గజ్జెలు మ్రోఁగఁగా విచ్చలవిడిగా మనసు వచ్చినచోట్లఁ దిరిగి తోఁపులందు దొడ్లయందు లేఁబచ్చిక మేసి కొలఁకునీరు త్రాగి చల్లని మ్రానినీడఁ గొంతవడి నెమరు

వెట్టుచుఁ బంపుకొని యుండి సాయంకాలమునకుఁ గట్టుఁబట్టునకు వచ్చి చేరుచుండుదును. ఒక్కనాఁ డాపట్టణమువీధిని సంచరించుచుండఁగా బాలకులు గుంపుగూడి కో యని కూఁకలు వెట్టుచు నన్ను వెంబడించి తఱిమిరి. నేను బెదరి చవుకళించి దాఁటుచుఁ బాఱి సమీపమం దున్న ప్రమదవనము చొచ్చితిని. చొరఁగా నే యక్కడిరాజాంతఃపురకాంతలు నన్నుఁ బట్టుకొని పోయి యంతఃపురములో రాచకొమారునిశయనగృహమునకు దాఁపు గా నొక కంబమునకుఁ గట్టిపెట్టిరి. నాఁటి రాత్రిఁ గన్నులు మిఱుమిట్లుగొలుపు మెఱుపులతో శ్రవణకుహరములు విదారించునుఱుములతోఁ గడవలతో ముంచి పంచినట్లు నిరంతరధార మయి మిన్ను మన్నేక మయినట్లు కారు గమ్మి యొకవర్షము గురిసెను. అప్పు డావర్షము చూచి మిక్కిలి కుతూహలపడి మనుష్యభాషతో నాలో నేను "మీఁద వానచినుకులు పడఁగా మెల్లనిచల్లనిగాలి పొలయఁగా మాపదువుతోఁ గూడి చవుకళించి దాఁటుచు దువాళించుచు సద్యోజాత మయినకదంబముకుళజాలము మేయుచు విచ్చలవిడి గా సంచరించుభాగ్యము వెండి యు నా కెన్నఁడు గలుగు నో" యనుకొంటిని. అప్పుడు రాచకొమారుఁ డాచమనము చేయను వసారిలో వచ్చుచు నామాటలు విని దిక్కులు చూచి వెంబడి వచ్చులంపతావానిఁ జూచి యిక్కడ వింతవా రెవ్వరు లేరు. ఇప్పటిమాటలు నీవు ను వింటివి గదా ? ఇది యేమి వింత! ఈజాతకపిల్ల యొక్కటి యే యీలోఁగిట నున్నది. ఇది యీలాగున మాటలాడి యుండు నని తోఁచుచున్నది. నీ కేమి తోఁచుచున్న దనిన వాఁ డిట్లనియె. ఏలి

నవారికిఁ దోఁచినది తప్పదు. మనవిన్నమాటలచేఁ దెలియఁబ
డిన కోరిక మానిసికిఁ బుట్ట నేరదు. అనిన రాచకొమారుఁడు
విని యౌ నౌను లెస్సగా నూహించితి వని పలికి యాచమించి
పోయి శయనించి వరువాత లేచి కొలువుఁగూటమునకు వచ్చి
కూర్చుండి జ్యోతిశ్శాస్త్రపారంగతుని నొక్క బ్రాహ్మణుని
రావించి జరిగినవృత్తాంతము వినుపించెను. అతఁ డది విని
మృగము మానుష భాష భాషించుట మిక్కిలి యనిష్టసూచ
కము. దీనికి జపహోమాదులు చేయింపుఁడు. ఇప్పు డామృ
గమును ముందుగా దూరపుటడవిలో విడువఁ బంపుఁడు.
ఇట్టిమృగమును నిండిన యింటిలో నిమిష మయిన నిలుప
రాదు. అన విని రాచకొమారుఁ డంతఃపురమందుండి నన్నుఁ
దెప్పించి యీమృగమును దూరపుటడవిలో విడిచి రం డని
సేవకుల కాజ్ఞాపించెను. వారు నట్లు చేసిరి. ఆవ్వల వనములో
నక్కడక్కడఁ దిరుగు చుండఁ గా వేఁటకాఁడు తలువు కొని
వచ్చెను. నేను భయపడి పాటి వచ్చి మీామయుఁగు చొచ్చి
యప్పటిముప్పు తప్పించుకొంటిని. నే డిక్కడఁ దగులుకొని
నీయనుగ్రహమువలన బ్రదుకు గంటిని. ఇప్పటికిఁ గడతేరితి
మన రాదు. మీఁద నేమి రా నున్నదో యెఱుఁగుదు మా.
నీ వెంతటిబుద్ధి శాలివి ! నీవృత్తాంతము మంధరలఘుపతనకుల
వలన విన్నవాఁడను. నీవు పడ్డయిడుమలు చెప్పి తీరు నా ?
వేయిమాట లేల విను. విధి త్రివ్వులకు లోపడనిజంతు వొకటి
లోకమం దుండదు. అని చెప్పి మంథరుఁడు మనరాక వేచి
యుండును. మనలఁ జూచునందాఁక నాతనికిఁ బ్రాణములు
కుదుటఁబడవు. అని ముచ్చట లాడుచు వచ్చుచుండఁగా వింత

లోపల నక్కడ మంథరుఁడు లఘుపతనకహిరణ్యకులు పోయి
నదిక్కు చూచుచుఁ బోయిన వా రేల యింత తడసిరి?
పోయినపని నిరంతరాయము గా సాగె నేఁ దడ వేలపట్టును?
కటకటా యెట్టిపాపపుమాట వినఁబడు నో కదా. ఏమి చేయు
దును. అని తలపోయు చక్కడ నిలువఁ జాలక వెడలి వచ్చు
వాఁడు మార్గమందు హిరణ్యకాదులను జూచి యయ్యలారా!
వచ్చితి రా నాకడుపునఁ బాలు పోసితిరి. శీఘ్రముగాఁ బోయి
స్థానము చేరుఁడీ యని పలికె తాను ను వారివెంబడి వచ్చుచుం
డెను. అంత హిరణ్యకుఁడు మంథరునితో ని ట్లనియె. నిమిష
మెచ్చుతక్కువ గా రాక మానము దీనిలో నేమి మునిఁగిపోవు
నది? ఇట్టిసాహసము చేయ రాదు. ఏది గాని యిక్కడ
నొక్కయిక్కట్టు వచ్చె నా మేము తప్పించుకో నేర్తుము.
జలముల యందు వలె నీకు మెట్టలో గమనవేగము లేదు.
కాఁబట్టి యిప్పు డిక్కడికి నీరాక శుభోదర్కము గా నాకుఁ
దోఁచ లేదు. అనిన మంథరుఁ డి ట్లనియె. మీరిం తాలస్యము
చేసితిరి. మీ లోపల నొక్క రయిన ముందు వచ్చి జరిగిన
వృత్తాంతము చెప్ప వచ్చును గదా? అది యును లేకపోయెను.
మీఁదుమిక్కిలి గాఁబోయినవా రేమికీడునకుఁ బా లయి రో
యే మయి రో కదా యని మనసు మఱి మఱి తత్తరింపఁ
దొడఁగెను. నీవు చెపు మా యెట్లు నిలువ మనసు వచ్చును?
మిమ్ముఁ జూచినవెనుకఁ గా నాగుండె కుదిరినది. అని సల్లాప
ములు సలుపుచుండఁ గా మృగయుఁ డురు లొడ్డినచోటికి
వచ్చి మృగ ముచ్చు త్రెంచుకొని యుఱికిన దని యెఱిఁగి

యాశ్చర్యపడి వి ల్లెక్కు వెట్టి చేతఁ బట్టుకొని యడుగులజాడ చూచుచు మృగము పోయినదారి నే వచ్చుచుండఁ గా లఘుపతనకుఁడు చూచి యోహో మాటలపరాకున మీరు పెద్లి నడక నడచుచున్నవారు. వేటకాఁ డిదె వెంబడించి పొంచి కొని వచ్చుచున్న వాఁడు. మాటల కెడ లేదు. సత్వరముగా నూడనిఁబొండుఁ డనిన విని హిరణ్యకుఁ డొక్కలాఁగఁ దూఱెను. చిత్రాంగుఁడు పాఱిపోయెను. మంథరుఁడు నిసర్గమునకు భయము తోఁపడ నడవఁ గాళ్లు రాక మెల్లగాఁ బోవు చుండెను. అంత మృగయుఁడు తన్నుఁ జూచి మృగము పాఱిపోకకు ఖేదపడి యచ్చోటఁ గచ్ఛపమును జూచి కొంత సంతోషించి డాయఁబోయి పట్టుకొని గసయమునఁ గట్టుకొని మూపుమీఁదఁ బెట్టుకొని పోవుచుండెను. అప్పుడు చిత్రాంగాదులు మువ్వురు ను గూడుకొని మంథరునకు వచ్చిన వ్యసనమునకుఁ గన్నీరు విడుచుచుఁ గొంతదూరాన వేటకాని వెనుక నే పోవుచుండిరి. హిరణ్యకుఁడు చిత్రాంగలఘుపతనకులను జూచి ప్రాప్తించినదుఃఖము నిస్తరించితిమి గదా యని క్షణమునకు ముందు సంతోషపడితిమి యింతలో నే యీదుఃఖము ప్రాప్తించెను. ప్రాప్తించినదుఃఖమునకు విషాదపడ రాదు. వేటకాఁడడవి దాఁటి పోకముందే మంథరుని విడిపింప ననువయినయుపాయము వెదక వలెను. మించిపోయిన వెనుక మనకభిమతము సాధించుట దుష్కరము. అనిన విని చిత్రాంగలఘుపతనకు లి ట్లనిరి. మేను నిప్పులఁ బొరలిన ట్లెరియుచున్నది. చిత్తము స్వాయత్తము గాదు. కర్తవ్య మిట్టి దని

మాకుఁ దోఁచినది గాదు. నీవు బుద్ధిశాలివి. నీకుఁ దోఁపని యుపాయము లేదు. చెలికానిని విపత్సముద్రముదరి చేర్చి శోకసముద్రముదరిఁ దరి వలె మమ్ముఁ జేర్చుము. నీవు దక్క-మా కన్యము శరణము లేదు. కర్తవ్యమును మా కుపదేశింపుము. నీపంపు శిరసావహించి చేసెదము. అనిన హిరణ్యకుఁ డిట్లనియె. మనలోపల నొక్కరికి వచ్చిన మేలుగీళ్లకు మన మందఱము పాలివారము, కాఁబట్టి యిప్పుడు ప్రాప్తించిన వ్యసనమునకుఁ బ్రతీకారగవేషణము మీకుఁ బోలె నాకు నావశ్యకమయి యుండఁగా మీరు నన్నింత వేఁడుకో నేల? ఏ దో నాకుఁ దోఁచినయుపాయము చెప్పెదను. మీరు మీబుద్ధిచేత విచారింపుఁడు. సర్వసమ్మతమయినపక్ష మవలంబింతము. అని చెప్పి చిత్రాంగునిఁ జూచి నీవు వేఁటకానికంటఁ బడకుండ ముందు పోయి వాఁడు వచ్చుమార్గములో నొక జలాశయముతీరమం దొదిగిలి నాలుగు కాళ్లు చాఁచుకొని మ్రాఁగన్ను బెట్టి మెడ యెత్తి మూతి సారించి చచ్చినట్లు మెదలక పండుకొని యుండుము. లఘుపతనకుఁడు నీమీఁదఁ గూర్చుండి కన్నులు పొడుచుకొని తినువానివలె నభినయించుచు నఱచుచు నుండువాఁడు. అంత వేఁటకాఁడు మృగము చచ్చి పడి యున్నదని భావించి మంథరునితోడ విల్లు దించి నేలఁ బెట్టి చేరువకు వచ్చును. నేను వాని వెంట నే వచ్చి మంథరునిబంధము చిటుకనకుండఁ దెగఁగొఱికెదను. అంతట మంథరుఁడు జలాశయము ప్రవేశించువాఁడు. నేను బొఱియ దూఱెదను. మీరు పాఱి పొండి. ఇది నాకుఁ దోఁచిన యుపాయము. అనిన విని చిత్రాంగ

లఘుపతనకులు హిరణ్యకునిబుద్ధికి మిగులసంతోషించి తదుక్తప్రకారమునఁ గార్యము నిర్వర్తింప హిరణ్యకుఁడును దనపాలికార్యము నెఱవేర్చి మనోరథసిద్ధిఁ బడసెను. అప్పుడు మృగయుఁడు మిగులవగఁ జెంది యల్లల్లఁ దనమనికిపట్టునకుఁ జనియె. హిరణ్యకాదులు తమతమనెలవులకుఁ జని తొంటియట్లు సుఖముండిరి.

మిత్రలాభము సంపూర్ణము.



# పంచతంత్రము.

——:0:——

## సంధివిగ్రహము.

శత్రువయినవాఁడు తనకార్యముకొఱకు మిక్కిలి స్నేహముఁ జేసినను వానియెడ సందిహానమానసుండుగానే వర్తిల్లవలయును గాని వానిని నమ్మఁగూడదు. నమ్మిన నవశ్యముగా నెగ్గు చేయును. ఇది నిశ్చయము. కాకులు గ్రుడ్లగూబలను నమ్మించి వాని గుహలో నుండి వాకిట నిప్పుఁ బెట్టి కపటముచేత నన్నింటినిం జంపెను.

అని విష్ణుశర్మ చెప్పఁగా రాజనందనులు విని, కాకులు గ్రుడ్లగూబల నేలాగున నమ్మించెను. వాని నన్నిటి నేలాగునఁ జంపెను. మాకు స్పష్టముగాఁ జెప్పవలె నవిన విష్ణుశర్మ యిట్లనియె.

ఒకయడవిలో గొప్పకొమ్మలచేత భూమియు నాకాశంబును దిక్కులు నాక్రమించి సూర్యకిరణములు చొరఁ గూడని యాకుజొంపములచేతఁ బూర్ణమయి సజల జలధరరూపమును ధరించి చూచువారికి నాశ్చర్యకరమయి మహాసర్పములకును సమస్తపక్షులకు నాశ్రయమగుచునయొక మఱ్ఱిచెట్టు గలదు. దానియందు ననేకవాయసములు తన్నుఁ గొలువఁగా శత్రువుల సంహారించుటయందు నిపుణుఁడయిన మేఘవర్ణుఁ డనపేరు గలవాయసరాజు వసియించి యుండును. వాయసములకు నివాసమైన మఱ్ఱిచెట్టునకు మిక్కిలి దూరముగాని యొకకొండ గుహయందు నుపమర్దుఁ డనుపేరు గలయులూకరా జనేకవ

లై నస్వజాతిపక్షులు తన్నుఁ గొలువఁగా వాసము చేయుచుం డును. అతం డొక్కనాఁడు రాత్రివేళఁ దనమంత్రులఁ బిలిచి వారలతో నిట్లనియె.

కాకులకును మనకును వైరము సహజము గనుక సమయము చూచి కాకులను జంపవలయును. మీరు మీసేనలఁ గూర్చుకొని రండు. అని పలికిన వా రట్లుచేసిరి. అప్పుడా గ్రుడ్లగూబ లన్నియు యమకింకరసమూహమువలె దండు వెడలి నడచుచుండఁగా నుపమర్దుండు సగమురాత్రినే మంత్రులును దానును సేనలతోఁ గూడఁ గాకు లుండు మఱ్ఱిచెట్టు దగ్గఱకుఁ బోయి, కొంత సేనల నా చెట్టుచుట్టు నిలిపి కొంత సేనలతోఁ జెట్టుపయి కెక్కి కాకు లధికనిద్రచేత నొడ లెఱుంగకున్నజాడఁ దెలిసి, కొన్నిటిని మెడలు గొఱికి, కొన్నింటిని బ్రక్కలు చీల్చి, కొన్నింటిని గడుపులు చించి, మఱియు ననేక ప్రకారములుగాఁ గాకులను నాశముచేసి, మునుపు మిక్కిలి కోలాహలధ్వనితోఁ గూడుకొని యున్న వటవృక్షము నిశ్శబ్దమై యుండుటం జూచి, శత్రువులను నిశ్శేషముగాఁ జంపితి మని సంతసించి, గ్రుడ్లగూబలతోఁ గూడుకొని నిజనివాసమునకుఁ బోయెను.

అట్టి యాపత్కాలమునందు మేఘవర్ణుం డొకతొఱ్ఱలోఁ దనదేహము దాఁచుకొనియుండి సూర్యోదయ మయిన వెనుక తొఱ్ఱవెడలి వచ్చి కాకకులమునకు వచ్చిన యాపదను జింతించుచుండుసమయమున నాతనికులక్రమాగతు లయినమంత్రులు, ఉద్దీపి, సందీపి, ఆదీపి, ప్రొద్దీపి, చిరంజీవి, అనువారలయిదు గురు తొలినాటిరాత్రి యేలాగుననో తప్పించుకొని బ్రదికి

వాయసరాజుకడకు వచ్చిరి. అప్పుడు మేఘవర్ణుఁడు వారిం జూచి దీనాననుం డై యిట్లనియె. రాజు లేనిమంత్రు లెందఱున్నను బనికిరారు. మంత్రులు లేనిరాజు మృతునితో సమానుఁడు. దైవవశమువల్ల మీరును నేనును బగవారి చేతిం జిక్కక తప్పితిమి. మీబుద్ధిబలముచేతను నాభుజబలముచేతను నేటివఱకుఁ బ్రబలుల మై యుండి కడపట గ్రుడ్లగూబలచేత ని ట్లయితిమి. ఇఁక మీఁద మనము చేయవలసిన దేమి?

అనిన మేఘవర్ణునకు సుద్దీపి యనుమంత్రి యిట్లనియె. బలవంతుఁ డగువాని శత్రువునకుఁ దొలఁగిపోయి బలవంతుఁ డయిన మఱియొకనితోఁ గూడుకొని యుండుట యొకటి, స్థలము విడిచిపెట్టి యసాధ్యమయినదుర్గములోఁ బ్రవేసించి యుండుట యొకటి, దూరదేశమునకు వెళ్లి యచ్చట నణఁగియుండుట యొకటి, ఈ మూఁడువిధములు నాకుఁ దోఁచినవి. ఇంక నీచిత్తము. అని పలికిన విని యతఁడు సంగీపిం జూచి నీ కేమి తోఁచుచున్న దని యడిగిన—మహాసనయమునతో సందీపి యిట్లనియె. మొదట దేవరవారితో నుద్దీపి చెప్పిన మూఁడుపక్షములును సరే. అయిన వానియందు స్థానత్యాగము సంభవించుచున్నది. త్వరపడి స్థానత్యాగము చేయఁ గూడదు. ఎందువల్లననిన—తా నున్నచోటనే యుండిన ననుకూలముగాఁ గార్యములు సిద్ధించును. చోటు తప్పించి యుండినఁ గార్యములు సిద్ధింపవు. మేఁకకుఁ బొడుఁగుచన్నులలోఁ బాలు గలిగినట్లు మెడచన్నులలోఁ బాలు గలుగునా? తనస్థానమునందుఁ బ్రమాదము లేకుండ నిల్చినరాజునకు జయము గలుగుట సిద్ధము. కుక్కసహితము తన్నుఁ బెంచినయింట నుండి యా

వాకిటికి నెందఱు వచ్చినను స్థానబలమువల్ల నందఱిని గెలుచుచున్నది. కాఁబట్టి మన నెలవు విడువక కాలముఁ గడపుచుండి మనకు బలము కలిగినప్పు డొక యుపాయము వెదకి శత్రువుల జయింతము.

అని సందీపి పలికిన విని మేఘవర్ణుఁడు ఆదీపిం జూచి నీ కేమి తోఁచుచున్నదని యడిగిన—నాకుఁ దోఁచినయర్థము మనవిచేయుచున్నాను వినుమని యాదీపి యిట్లనియె. బాలురను, వృద్ధులను, స్త్రీలను, సామగ్రులను విడిచిపోవుట యశక్యము; తీసికొనిపోవుట మిక్కిలి యశక్యము. సంధి చేయుట యుక్తము. బలవంతునితో సంధిచేయుట మిక్కిలి మేలు. కాఁబట్టి మన మందఱిమేలుకొఱకు శత్రువులతో బాగుగా సంధిఁ జేసి కూడి యుందము.

అనిన విని ప్రోద్దీపిం జూచి నీ వేమి చెప్పుచున్నా వనిన నతం డిట్లనియె. గుడ్లగూబలకు రాత్రిపూఁట నే కాని పగటిపూఁటఁ గన్నులు గానరావు. మనకు పగటియందే కాని రాత్రిపూఁటఁ గన్నులు గానరావు. కాఁబట్టి దూతి నంపుట యెట్లు? సంధి యగు టెట్లు? అవి రాత్రి వచ్చి మనమీఁదఁ బడి చంపెను. మనము పగలు పోయి వానిమీఁదఁ బడి చంపుదము.

అనిన విని చిరంజీవి యను మంత్రిం జూచి నీవు సకల నీతిశాస్త్రములఁ దెలిసిన వాఁడవు. ఇప్పుడు చేయవలసిన కార్యమును బాగుగా నాలోచించి చెప్ప వలయు ననినఁ జిరంజీవి యిట్లనియె. వీరందఱును బరమాప్తులు. నేరుపు గలవారు. నీతిశాస్త్రమునందు వీరికంటె నెక్కుడ తెలిసినవారు లేరు.

అయినను నాకుఁ దెలిసినంతవఱకు నేనును విన్నపము చేయుచున్నాను. దేవా మీరందఱు నమ్మికము గలవారు. మంత్రమా ప్తపరంపరచేత భేదిల్లకుండ రక్షింపఁబడక పోయిన సమస్తకార్యములకును విఘ్నము వచ్చును విఘ్నము వచ్చినా రాజ్యము వృద్ధిఁ బొందదు. కాఁబట్టి రాజులకు మంత్రరక్షణము ముఖ్యకార్యము. సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము, ఆశ్రయము, అను షడ్గుణములెఱింగి, కర్మారంభోపాయము, పురుషద్రవ్యసంపత్తి, దేశకాలవిభాగము, వినిపాతప్రతికారము, కార్యసిద్ధి, అనియెడు పంచాంగములయందు నేర్పుగలిగి, సామదానభేదదండంబు లనుచతురుపాయంబులు దెలిసి, ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి, అను శక్తిత్రయము గలిగి, స్త్రీలు, జూదము, పానము, వేఁట, వాక్పారుష్యము, తగని వెచ్చము, కఠినదండము, అను సప్తవ్యసనములయందుఁ దగులు కొనకుండ నాయాకాలమునకుఁ దగినవానిఁ బ్రయోగించు చుండవలసినది. ఇప్పుడు మనకు బలము తక్కువ పడి యున్నందున యుద్ధమునకు సామర్థ్యము లేదు. కాఁబట్టి యిది యుద్ధమునకుఁ గాలము గాదు. తనశక్తియు దేశంబును గాలంబును విచారించి ప్రతికూలములైయుండెనా కొంగవలె నూరకుండ వలసినది. లేకపోయిన సింహమువలె విక్రమించి శత్రువులను సంహరింప వలసినది. తనబలము నెదిరిబలమును మనసున బాగుగా విచారింపక శత్రువులను జయించుటకయి యెవఁడు ప్రయత్నము చేయుచున్నాఁడో వానికి నాపదలు వచ్చుట సిద్ధ మని పెద్దలు చెప్పుచున్నారు. అసమాన మైనప్రతాపము గలశత్రువు దూరమునం దుండినను

దనశత్రువులబలము నణఁచును. అల్పుఁడైనశత్రు వాయుధ
ముఁ జేతఁ బట్టుకొని సమీపమునం దుండినను తన శత్రువును
సంహరింప శక్తుఁడు గాఁడు. ఓర్పు గలిగి సమయము వచ్చి
నప్పుడు పరాక్రమమును జూపుచుఁ దనగుణదోషముల నెదిరి
గుణదోషములను గుర్తెఱిఁగెడుబుద్ధి మంతుఁ డయినవాఁడు
శత్రువును నమ్మఁడు. ఉపాయవంతుఁ డగువానిదగ్గఱకు బలా
త్కారముచేతఁ గాకుండ లక్ష్మి తనకుఁ దానే వచ్చి బహు
సంతోషముతో వానియింట నెల్లకాలము నిలుచును. మదిం
చినవారికి, చాడీచెప్పెడివారికి, లోభముగలవారికిఁ, గామాతు
రులకు, దుష్టులకు, గర్వించినవారికిఁ, గ్రోధముగలవారికి, దండ
నీతి సులభము గాదు. మర్యాద దప్పక గర్వపడక కార్యములు
సేయునెడలఁ జక్కఁగా విచారించుచు నోర్పు గలిగి యుపాయ
ములను గుర్తెఱిఁగి మాత్సర్యము లేక యుండువారికి దండనీతి
సులభము. రాజునకుఁ జతురంగబలసమృద్ధి లేకపోయినను
బొక్కసమును మంత్రమును నున్న నవి యుద్ధము చేయును.
బొక్కసమువల్ల నెల్లవారును భృత్యు లగుదురు. మంత్రము
వల్ల జగత్తు జయింపఁబడును. ప్రాణత్యాగము చేసినను బొంద
రాని సంపదలు నీతి గుర్తెఱిఁగిన వారియింటను దమకుఁ దామే
వచ్చియుండును. శూరులును, ఉపాయముఁ దెలిసినవారును,
బుద్ధిమంతులును, విద్వాంసులును, సహాయు లయినరాజు సర్వో
న్నతుఁ డగును. రాజౌట సత్సహాయమువల్లనే కదా. రాజ్య
లక్ష్మి వంశపరంపరగా వచ్చి యున్న దయినను, మంచిసహా
యము లేనివాని విద్వాంసు నయినను సొగసుకాని నయినను
వరింప నిచ్ఛగింపదు. శూరుఁడును సత్సహాయుఁడు నయిన

వానినే వరియించును. రెక్కలు లేనిపక్షికి నాకాశగమన మెలాగునఁ గొనసాగదో యాలాగుననే సహాయము లేనివానికి నొక ప్రయత్నమైనను గొనసాగ నేరదు. ప్రభువు తనబుద్ధికిఁ దోఁచిన కార్యము వివేకి యైనయాప్తునితో నాలోచన చేసిన నోడ గడపువానిచేత నేలాగున రేవు పట్టునో అలాగే విఘ్నము లేకుండఁ జక్కఁగా క్షేమమును బొందును. తనయాదాయమును వ్యయమును స్పష్టముగాఁ దెలిసికొని గూఢులైన చారులను సంపాదించి మంత్రము గుప్తముచేసి ప్రాణులకు నప్రియములు పలుకక దయ గలవాఁడయి యెవఁ డుండునో వాఁడు సముద్రముచేత నావరింపఁబడిన సకల భూమిని ననుభవించును. తనశక్తి నెఱుఁగక గర్వాంధుఁడయి గొప్పకార్యమునకు నారంభించువాఁడు బావిలోఁ బడ్డగ్రుడ్డివానివలెఁ జెడిపోవును. కాఁబట్టి యిప్పుడు యుద్ధము మంచిది కాదు. ఉలూకములకును మాకును సహజవైరము గనుక సంధియుం బొసఁగ నేరదు.

అని పలికిన మేఘవర్ణుఁడు చిరంజీవిం జూచి నీవు ముందు వెనుకలు గుర్తెఱిఁగినవాఁడవు. ఉలూకములకును మాకు నేలాగు విరోధము పుట్టినది, చెప్పు మని యడిగెను. చిరంజీవి మేఘవర్ణుం జూచి వాగ్దోషమువల్ల విరోధము పుట్టెను. తొల్లి బుద్ధి లేని యొకగాడిద పులితోలుచేతఁ గప్పఁబడి వేసంగికాలమెల్లను బయలను కసవునిండ మేసి బ్రదికి యుండి తనవాగ్దోషముచేత హతమాయెను గదా యని చెప్పెను. అ దెట్లని వాయసరా జడిగెను. చిరంజీవి చెప్పుచున్నాఁడు.

ఒకయూరిలో నొకచాకలి బట్టలమూటలు మోయుటకయి యొకగాడిదను దెచ్చిదాని బలిపింపవలె నని మనస్సు పుట్టి దానిపయిని పులితోలు గప్పి పండినచేలలో రాత్రి పూటఁ దోలుచు వచ్చెను. అది యథేష్టముగాఁ బయిరు మేయుచుండెను. ఆపొలమునఁ గావలియుండువారు దానిం జూచి పులి యను భ్రాంతిచేత దూరముగాఁ దొలఁగి పోదురు గాని పయిరు మేయకుండ దానిఁ జోలరు. ఇట్లుండఁగాఁ గొన్ని దినములకు నొకచేనివాఁడు సాహసముచేసి బూడిదవర్ణముగల గొంగడి గప్పుకొని వింట బాణము సంధించుకొని పొంచి యుండఁగా నాగాడిద యక్కడికి వచ్చి యతనిం జూచి యది యొకగాడిద యనుకొని కూయుచు దగ్గఱకు వచ్చెను. అప్పుడు వాఁడు దానిఁ జూచి యోహో యిన్నిదినము లిది పులి యని పాఱిపోవుచుంటిమి. ఇది పెద్దగాడిద. నేఁడు దీనికూఁత వలనఁ దెలిసెను. ఇంక భయమేమి యని యొక బాణముతో దానిఁ జంపెను.

కాఁబట్టి కాకులకును గ్రుడ్లగూబలకును మునుపు వాగ్దోషమువలనఁ బ్రబల విరోధము సంభవించెను. అది యేలాగన్న నొకసమయమునందు భూమిలో నుండు పక్షు లన్నియుఁ దమ్ము రక్షించుటకొఱకు నొకఁడు రాజుగా నుండవలె నని యులూకశ్రేష్ఠునికిఁ బట్టము గట్టుటకుఁ బ్రయత్నము చేయుచుండఁగా నొకముసలికాకి పక్షిసమూహము దగ్గఱకు వచ్చి, యవి తమరు ప్రయత్నముచేసినపని తనకుఁ దెలియఁజేసిన విని వికారరూపము గలిగి దివాంధ మయిన గ్రుడ్లగూబను బక్షిరాజుగా మీరు చేయవలసిన దేమి? దీనికిఁ బట్టము గట్టినం

దున మనకేమి కాపుదల కాఁబోవుచున్నది. రాజు లేకపోయి నను రాజొకఁ డున్నాఁ డని చెప్పి కార్యము గడపుకొనఁ గూడదా? మునుపు చంద్రుఁడు రాజని చెప్పుకొని కుందేళ్లు సుఖింప లేదా? అని పలికెను. అది యెట్లని పక్షు లడిగెను. కాకి చెప్పుచున్నది. పూర్వ మొకానొకప్పుడు పండ్రెండు సంత్సరము లనావృష్టి వచ్చినందున నొకయడవి యందు గజసమూహములు తమయూథపతిని జూచిస్వామీ మాకేమియుపాయము? ఇక్కడ క్షుద్రజంతువులకు స్నానపానములకుఁ దగినసరస్సున్నది. మా స్నానపానములకుఁ దగినది లే దని చెప్పఁగానే, యూథపతి వేగము గలయేనుఁగులను వారిపూరముగల ప్రదేశములను వెదకి వచ్చుటకయి ప్రతిదిక్కునకు నంపించెను. వాని యందు నొకయేనుఁగు వెదకి వచ్చి—అయ్యా యిక్కడికి సమీపమున స్వచ్ఛమయిన యుదకము గలగొప్పసరస్సున్నదని చెప్పెను. ఆమాట విని గజరాజు యేనుఁగులను వెంటఁ బెట్టుకొని మహాసంతోషముతోఁ ద్వరగాఁ గొలనిచెంతకు నడచెను. ఏనుఁగులు నడచునప్పుడు వానికాళ్ల క్రిందఁ బడి నలఁగి యనేకము లయిన కుందేళ్లు చచ్చెను. తర్వాత శిలీముఖుఁ డనుశశకరాజు తనమంత్రుల నందఱిని నాలోచించుటకుఁ బిలిచి యెక్కడ నీళ్లు లేనందున నేనుఁగులగుంపు లిక్కడికి వచ్చి మేఘములవలె నెల్ల దిక్కులను వ్యాపించెను. వానికాళ్లత్రొక్కుడుచేత ననేకము లయినకుందేళ్లు నలఁగి చచ్చెను. ఈ యేనుఁగులయుపద్రవము మన కేలాగు లేక పోవును? ఏమి చేయుద మని చెప్పఁగా బహువృత్తాంతములను గుర్తెఱిఁగిన విజయుండను ముసలికుందేలు శిలీముఖునిం జూచి యయ్యా

యేనుఁగు లిక్కడికి రాకుండఁ జేయుట ప్రయాసము కా దనెను. ఆ మాటకు శిలీముఖుఁడు సంతోషించి యోవిజయా నీతిశాస్త్రములను దేశకాలములను గుఱ్తెఱిఁగిననీ వేపనికిఁ బూనిన నాపని నిశ్చయముగా సిద్ధించు నని పలికెను. విజయుఁ డామాట విని దేవర వా రాజ్ఞాపించిన నే నిదిగో కార్యము సాధించుకొని వచ్చెద నని సెలవు దీసికొని లేచి యవతలికిఁ బోయి యేనుఁగులం జూచి నావంటి యల్ప దేహు లీయేనుఁ గుల సమీపమునకుఁ బోయి యేలాగున మాటలాడవచ్చును? స్పృశించుచున్నదానివలె నేనుఁగు చంపును. ఆఘ్రాణించుచున్న దానిరీతిని బాము చంపును. నవ్వుచున్న వానికరణి రాజు హింసించును. మన్ననచేయుచున్నవానివగిది దుర్జనుఁడు వధించును. కాఁబట్టి నేను బర్వత శిఖరము నెక్కి గజరాజుతో మాటలాడెద నని నిశ్చయించి నగాగ్ర మెక్కి నిక్కి గజరాజుం జూచి యోయి గజరాజా! నీవు శుభ మవుఁగాక యని పలికెను. కరిరాజు విజయునిం జూచి నీ వెవఁడవు? ఎక్కడ నుండి వచ్చితివి అని యడిగెను. నేను దూతను, నన్ను భగవంతుఁ డయిన చంద్రుం డంపెను. అని కుందేలు చెప్పెను. ఏమి పనికి వచ్చినా వని యేనుఁ గడిగెను. ఆ మాటకుఁ గుందే లిట్లనియె. ఆయుధము దూసికొని తన్నుఁ జంపవచ్చి నను బంటు భయపడక యదార్థము చెప్ప వలయును. రాజు దూతను జంపఁ గూడదు. నేను స్వామి యాజ్ఞాపించిన ప్రకారముగాఁ జెప్పుచున్నాను. తనబలము నెదిరిబలమును లెస్సగా విచారింపక యజ్ఞానముచేత నెవఁడు కలహామునకుఁ బ్రయత్నము చేయుచున్నాఁడో వానికి విపత్తులు వచ్చును. చంద్రుఁ

డీసరస్సును రక్షించునిమిత్తము కుందేళ్ళ నంపెను. కాఁబట్టి మమ్మెవ్వరును బెదరింప లేరు. ఈసరస్సు చంద్రుని దయవలం దున దీనికిఁ జంద్రసరస్సను పేరు వచ్చినది. శశము లనఁగాఁ గుందేళ్లు; వానిని గలవాఁడు కాఁబట్టి చంద్రుఁడు శశి యను పేరు వచ్చినది. మేము చంద్రునికి బిడ్డలవంటివారము. మమ్ము ననేకులను మీరు నలఁగఁ ద్రొక్కి చంపి వైచితిరి. ఈవార్త విని చంద్రునికి మిగులఁ గోపము వచ్చి యేనుఁగు లీప్రకార మెందుకుఁ జేసెనో తెలిసికొని రమ్మని నన్నంపినాఁ డని చెప్పఁగానే యాయేనుఁగు భయపడి, అయ్యా యజ్ఞానము వలనఁ జేసినాము, మేము తిరుగఁ బోవుచున్నాము, కోపము చేయవల దని వేఁడుకొనెను. మా రాజయిన చంద్రునితోఁ జెప్పి సెలవు దీసికొనిపొండు. ఈసాయంకాలమునకుఁ జంద్రుఁ డిక్కడికి వచ్చు నని కుందేలు చెప్పఁగా నేనుఁగు సమ్మతించి యుండెను. తర్వాతఁ బ్రొద్దుగ్రుంకఁగానే చెవులపోతు గజ రాజును జంద్రునికొలువునకు రమ్మని కొలనిదగ్గఱకుఁ బిలుచుకొని పోయి కొలనిలోఁ జంద్రప్రతిబింబమును జూపెను. మా యపరాధము సహింప వలెను. అజ్ఞానము వల్లఁ దప్పు చేసితిమి. ఇఁకమీఁద నీదిక్కునకు రాము. అని గజరాజు చంద్ర ప్రతిబింబమునకు మ్రొక్కెను. అంతటఁ జెవులపోతు హస్తిరాజును జూచి చంద్రుఁడు దయతో నిన్ను విడిచిపెట్టెను. నీవు నను వచ్చిన చోటికి శీఘ్రముగాఁ బొమ్మని చెప్పెను. గజసమూహములతోఁ గూడ గజనాథుఁడు బహువేగముతో మఱియొకచోటికిఁ బోయెను. తర్వాత విజయుఁడు శిలీముఖుని చెంతకు వచ్చి యతని పాదములకు మ్రొక్కి, దేవా యొకయుపా

యముచేత నేనుఁగు లీకొలను విడిచి పోవునట్లు చేసి వచ్చితిని. ఇంక మన మీచోటు విడువక సుఖముగా నుండ వచ్చు నని యావృత్తాంతమంతయుఁ జెప్పెను. శిలీముఖుఁడు విజయునిం గౌఁగిలించుకొని బహు విధంబులఁ బ్రశంసించి సుఖముగా నుండెను.

కాఁబట్టి రాజొకఁ డున్నాఁ డని చెప్పి కార్యము గడ పుకొనఁ గూడదా యని చెప్పితిని. వీఁడు క్షుద్రుఁడు. అశ క్తుఁడు. మనల రక్షింప నేలాగున శక్తుఁ డవును. అల్పునిఁ బ్రభువుఁగా సేవించి శశకపింజలములు మృతిఁ బొందినది విన లేదా యని పలుకఁగా, నావృత్తాంతం బెట్లు చెప్పు మని పక్షు లడిగెను. ముసలికాకి యిట్లనియె.

బహు దినముల క్రిందట నే నొకచెట్టుమీఁద వాసము చేయు చుండఁగా నాక్రిందఁ జెట్టుతొఱ్ఱలోఁ గపింజల మను పేరు గలపక్షి వాసము చేయుచుండెను. ఒకనాఁడు కపింజ లము సాయంకాలమువఱకు నివాసస్థలమునకు రాకపోయెను. తర్వాత నేను దిగులుపడి దిక్కులన్నియుఁ జూచుచుండు సమ యమున దీర్ఘకర్ణుం డనుకుందేలాతొఱ్ఱలోఁ బ్రవేశించెను. వల దని నే నెంత చెప్పినను వినకపోయెను. పిమ్మట మఱికొంత సేపటికిఁ గపింజలము వచ్చి నాచోట నీవెందునకు వచ్చి యున్నా వవతలికిఁ బొమ్మని చెప్పెను. బావులు చెఱువులు చెట్టుతొఱ్ఱలు మొదలైనవి యొకరి సొమ్ములు గావు. ఎవ రాక్రమించుకొనినది వారిసొమ్ము. ఇప్పు డీచోట నేను బ్రవే శించితిని గనుక నీకు నిమిత్తము లేదు పొ మ్మని దీర్ఘకర్ణుఁడు చెప్పెను. నాయిల్లు కవ్వుకొనుట నీకుఁ దగునా? యిప్పుడు

నీవు నాచోటైనను విడిచిపెట్ట వలసినది. తగవునకైనను రావలసినది. లేకున్న నాతో జగడమైనను జేయవలయు నని కపింజలము కుందేటితోఁ బలికెను. వ్యవహారమునకు రమ్మనిన రా ననవచ్చునా? పోద మని యాపక్షితోఁ గూడఁ గుందేలు నడచెను. నేను నా యుద్ధముతోఁగూడ వేడుకగాఁ బోతిని. తరువాతఁ గొంత దూరము పోఁగానే కపింజలము కుందేటిని జూచి మనకుఁ దగవు తీర్చువారెవ రని యడిగెను. యమునా నదీతీరమునందు దధికర్ణుఁ డనుపేరు గలిగిన ధార్మికుఁ డైన జరఠమార్జాలరాజు గలఁడు. అతని చెంతకుఁ బోయి మనము తగవు దీర్చుకొందమని కుందేలుత్తర మిచ్చెను. పిల్లి యెల్లప్పుడు మిక్కిలి క్రూరహృదయము గలది. దాని నమ్మఁ గూడ దని నాకు బాగుగాఁ దెలియును. నీమనస్సున కేలాగు నమ్మకము పుట్టిన దని పక్షి పలికెను. ఆమార్జాలాధిపతి యాచారవంతుఁడు ఉత్తముఁడు ధర్మశాస్త్రములు చదివినవాఁడు; ఈ సమీపములో నున్నవారందఱు నతని నెఱుఁగుదురు. నీవు భయపడక నాతోఁ గూడ శీఘ్రముగా రమ్మని శశము చెప్పెను. భయము నీకు నాకు సమానమే, నాకుఁ గీడు వచ్చిన నీకు రాదా. చెప్పఁదగినబుద్ధి చెప్పితిని. నీవు వినక పోయిన నే నేమి చేయఁగల నని పక్షి యనెను. తర్వాత నవి రెండును దధికర్ణుఁ డుండెడు చోటికిఁ బోయి దూరముగా నిలిచి, యోదధికర్ణా మేమిద్దఱము స్థలమునిమిత్తమై వివాదపడి నీచెంతకు వచ్చితిమి. పక్షపాతము లేకుండఁ దగవు దీర్చి త్వరగా మమ్మంపవలె నని చెప్పెను. దూరముగా నుండి చెప్పిన నాకుఁ జెవులు వినవు, కన్నులు గానరావు, సమీపము

నకు వచ్చి చెప్పిన వినవచ్చును, సమీపమున నున్న వస్తువు కంటికి నగపడును; నాకు మునుపటివలె నింద్రియపటుత్వము లేదు. మహావృద్ధనైతి నని దధికర్ణుఁడు పలికెను. అవి కొంచెము దగ్గఱకు వచ్చెను. అప్పుడు మార్జాలము వానికి మిగుల నమ్మకము పుట్టునట్టుగా నిట్లనియె. ధర్మము చెరిచిన నది తన్నుఁ జెఱుచును. ధర్మమును రక్షించిన నది తన్ను రక్షించును. కాఁబట్టి ధర్మమును జెడఁగొట్ట రాదు. మరణకాలము నందుఁ దోడుగా వచ్చునది ధర్మమొక్కటే కాని, యితరమైన ధనము మొదలైనవానిలో నొకటైనను దనతోఁగూడ రాదు. నేను జెప్పెడుమాట సత్యము. నేను గల్లలాడువాఁడను గాను. కల్లలాడు దుష్టుఁడు నరకమునందుఁ బడును. సందియము లేదు. అహింసకు సమానమైన ధర్మము లేదు. పరభార్యలను దల్లి వలెను, బరద్రవ్యములు నోటికుండపెంకువలెను, సర్వభూతములను దనవలెను, ఎవఁడు చూచునో వాఁడు పరబ్రహ్మమును దెలిసికొనును. భయపడి తన్ను శరణుచొచ్చినవాని రక్షించిన నశ్వమేధయాగము చేసిన ఫలము వచ్చును. ఈ ప్రకారముగా మార్జాలము చెప్పఁగా నవి నమ్మి మిక్కిలి సమీపమునకు వచ్చెను. రాఁగానే పిల్లి యారెంటి నొక్కసారిగాఁ బట్టి కాళ్ళతో నణఁచి చంపెను.

కాఁబట్టి యల్పునిఁ బ్రభువుగా సేవించి శశకపింజలములు మృతిఁ బొందెనని చెప్పితిని. వీఁ డల్పుఁడు గనుక రాజ్యార్హుఁడు గాఁడు. అని ముసలికాకి చెప్పెను. అంతటఁ బక్షులన్నియు నీకాకి నిజము చెప్పెనని యులూకమునకు రాజ్యాభిషేకము సేయక తమతమనెలవులకుఁ బోయెను. తర్వాత

నులూకపతి వృద్ధవాయసముదగ్గఱకు వచ్చి రోషముచేతఁ గన్నుల నిప్పు లొలుకఁగా నోవృద్ధవాయసమా! నేను నీకేమి యపకారము చేసితి? నీ వేందుకు నారాజ్యమునకు విఘాతముఁ జేసితివి? తీక్ష్ణమైన బాణము దగిలిన గాయము మానును. గొడ్డంట నఱకఁబడ్డకొమ్మ చిగిరించును. కాల్చుచున్న మంటలచేత మాఁడినతృణము తిరుగఁ బచ్చగిల్లును. నిష్ఠురోక్తులచేతఁ గొట్టఁబడ్డ హృదయమునందలిగాయ మెన్నటికిని మానదు. కాఁబట్టి యిఁకమీఁద మీకును మాకును వైరము సిద్ధ మని చెప్పి తనయింటికిఁ బోయెను.

అది కారణంబుగా నులూకంబులకును మనకును వైరము సహజమై ప్రవర్తిల్లెను.

అని చిరంజీవి చెప్పిన పని మేఘవర్ణుం డయ్యా మన మిప్పుడు చేయవలసిన యుపాయ మేమో సాయంకాలమునకు ముందుగానే యాలోచింపవలసిన దని చిరంజీవితోఁ జెప్పెను. చిరంజీవి యిట్లనియె. స్వామీ సంధివిగ్రహములు సేయ నిప్పుడు సమయము గాదు. యానాసనద్వైధంబులుం గూడవు. సమాశ్రయ మొకటి యుక్తంబు. అది నేనేవిధముగానైనను జేయుచున్నాను. శత్రువులు బలవంతులై యనేకు లుండినను బుద్ధిబలముచేత వంచింప వచ్చును. మును వొక బ్రాహ్మణు లొకవంచకునిచేత వంచింపఁబడలేదా? అని పలికిన మేఘవర్ణుం డాకథ యెట్లని యడిగెను. చిరంజీవి యిట్లనియె.

తొల్లిటికాలమునందుఁ గొందఱు బ్రాహ్మణులు యాగార్థముగా నొకమేఁకపోతును గొని తీసికొనిపోవుచుండఁగా మార్గములో నొకవంచకుఁడు చూచి యామేఁకపోతును వారు

తర్వాత సూర్యాస్తమయము కాఁగానే యుపమర్దుఁ డనెడు ఘూకరాజు తనమంత్రులం జూచి శత్రులను నిశ్శేషముగాఁ జంపవలయును. ఒకఁడు శేషించినను మనకు మంచిది గాదు. అగ్నిశేషము, ఋణశేషము, శత్రుశేషము, నిలుపఁగూడదు. కాఁబట్టి మనము త్వరగా నామఱ్ఱిచెట్టుకడకుఁ బోయి కాకులను వెదకి చంపవలె నని పలికెను. మంత్రు లామాట విని దేవరవారు చెప్పినది మహాయుక్తముగా నున్నదని యుపమర్దుని శ్లాఘించి యతనితోఁ గూడుకొని కాకనివాసం బగుతొఱ్ఱివద్దకుఁ బోయి యక్కడ నొకకాకియైనను గానక కాకు లన్నియుఁ జచ్చె ననుకొని తిరిగి వచ్చు సమయమునఁ జిరంజీవి కూసెను. ఆకూఁత విని గుడ్లగూబలు పోయి చిరంజీవినిఁ బట్టుకొని వచ్చి యుపమర్దునిదగ్గఱ నుంచెను. ఉపమర్దుఁ డతనిఁ జూచి నీ వెవఁడవని యడిగెను. నేను చిరంజీవి యనువాఁడ నని యది చెప్పెను.

నీవు మేఘవర్ణునికిఁ బ్రధానమంత్రివి గావా? నీ కీ యవస్థ యేలాగున వచ్చెనని యతం డడిగెను. అయ్యా పన్నాలోచన యడిగిన నుపమర్దుఁడు బలవంతుఁడు గనుక నతని శరణుచొచ్చి బ్రతుకుద మని చెప్పినందున వీఁడు శత్రుపక్షపాతి యని కాకు లన్నియుం గూడి నన్ను ముక్కులఁ బొడిచి కాళ్లం దన్ని యీలాగుచేసెను. ప్రాణములు పోలేదు, మీ రయినను బాగుగాఁ జంపుఁ డని చిరంజీవి చెప్పఁగా, నుపమర్దుండు విని రక్తాక్షుఁడు మొదలగు తనమంత్రులం జూచి వీని నేమిచేయుదమనిన నందులో రక్తాక్షుం డిట్లనియె. శత్రువు హీనబలుం డయి యున్నప్పుడు దొరకిన నవశ్యము చంపవలయును. దయ చేత వాని రక్షించినట్లయిన మీఁదటికి వాఁడే

ప్రబలశత్రు వగును. కాఁబట్టి వీని నిప్పుడు చంపుద మని చెప్పఁగ క్రూరాక్షుం డిట్లనియె. శరణు చొచ్చినవానిఁ జంపిన మిక్కిలి పాప మని ధర్మశాస్త్రమునందుఁ జెప్పఁబడి యున్నది. కాఁబట్టి దయచేత వీని రక్షింపుము. అని యనంతరము దీప్తాక్షుం డను మంత్రిం జూచి నీకు దోఁచిన మాట చెప్పు మనిన, దీప్తాక్షుండు, అయ్యా శరణాగతునిఁ జంపుట యిదివఱకు నే నెక్కడ వినలేదు. మునుపు కపోతము, శరణు చొచ్చిన బోయ వానికి స్వశరీరమాంస మిచ్చెను.

కాఁబట్టి నీవును శరణాగతుఁ డయిన యీవాయసంబును దయఁ జూడవలయును. అనిన విని యుపమర్దుండు వక్రనాసుం డను మంత్రిం జూచి నీవేమి నుడివెద వని యడుగఁగా, ఈకాకిని జంపఁ గూడదు. శత్రువులు తమలోఁ దాము విరోధపడుట మనకు మంచిది. తొల్లి చోరుండును, రాక్షసుండును, విరోధపడి చోరుండు ప్రాణములను, రాక్షసుండు రెండావులను, బ్రాహ్మణుని కిచ్చిరి. ఆకథఁ జెప్పెద వినుమని వక్రనాసుం డిట్లనియె.

ఒకయగ్రహారములో నొకబ్రాహ్మణుండు గలఁడు. అతఁడు మంచినడవడిక గలవాఁడు. అతనికి మంచియావులు రెండు గలవు. ఆయావుల నపహరింపవలె నని యొకతస్కరుఁడు బహుదినములనుండి కనిపెట్టుకొని యుండి యొకనాఁడు రాత్రి రెండుజాములవేళ మబ్బుపట్టి సన్నచినుకులు రాఁగా దట్టమై చీఁకటిలో నొంటిగాఁ బోవుచు నొకనిచెయ్యి తన దేహము తాఁకఁగానే బెదరక నీ వెవ్వఁడ వని యడిగెను. బ్రహ్మరాక్షసుఁడ నని యతఁడు చెప్పి నీ వెవ్వఁడ వని దొంగ నడిగెను. నేను దొంగ నని వీఁడు చెప్పెను. నీ వెక్కడికిఁ బోవు

మున్నావని రాక్షసుం డడిగెను. బ్రాహ్మణునియావుల నపహ
రింపఁ బోవుచున్నానని దొంగ చెప్పెను. నేనా బ్రాహ్మణునిఁ
బట్టఁ బోవుచున్నా నని రాక్షసుఁడు పలికెను. తర్వాత వా
రిద్దఱు బ్రాహ్మణునియింటివాకటఁ బోయి నిలిచిరి. అప్పు డా
రాక్షసుఁడు దొంగనుం జూచి నేను ముందుగా లోఁగాఁ బో యి
యీ బ్రాహ్మణునిఁ బట్టుచున్నాను. తర్వాత నీ వావులను
దోలుకొని పొమ్మనఁ జెప్పెను. ఆమాట దొంగ విని నీవు
ముందుగా బ్రాహ్మణునిఁ బట్టి బ్రాహ్మణుఁడు లేచి కేకలు
పెట్టినేని యిరుగుపొరుగువారు లేతురు. ఆ సమయములో
నేను పరుగెత్తిపోవలసినదే కాని యావులనెట్లు తోలుకొని
పోఁగలను? నేను ముందుగా నావులఁ దోలుకొని యీగ్రా
మము దాఁటి పోఁగానే నీవు బ్రాహ్మణునిఁ బట్టవచ్చునని
రాక్షసునితోఁ జెప్పెను. అంతట వారిద్దఱు నాగ్రహము
చేత దేహములు దెలియక గట్టిగా మాటలాడఁగా నాసంవడి
చేత నింటి బ్రాహ్మణుఁడు మేల్కొని తలవాకిటికి వచ్చి యీ
పగను రాత్రివేళ మావాకిట జగడమాడుచున్నారు, మీ రెవ
రని యడిగెను. వీఁడు నిన్నుఁ బట్టవచ్చిన బ్రహ్మరాక్షసుఁ
డని దొంగ చెప్పెను. వీఁడు నీయావుల నపహరింప వచ్చిన
దొంగ యని బ్రహ్మరాక్షసుండు చెప్పెను. అప్పుడు బ్రాహ్మ
ణుఁడు తన మంత్రబలముచేత బ్రహ్మరక్షస్సును పాఱఁదోలెను.
అంతకు మునుపే దొంగ పరుగెత్తిపోయెను. కాఁబట్టి శత్రువులు
తమలోఁ దాము పోరుట మేలు. అదియునుగాక మహాత్ముఁ
డయిన శిబిచక్రవర్తి తనమాంసమును గోసి డేగ కిచ్చి శరణు

చొచ్చినకపోతమును రక్షించినాఁ డని చెప్పఁగా వినలేదా? నీవు శరణాగతునిం జంపఁ గూడదు.

అనిన విని యుపమర్దుఁడు ప్రాకారవర్ణుం డనుమంత్రిం జూచి నీ తాత్పర్యమేమి యని యడిగిన నతండును వక్రనాసుఁడు చెప్పినట్లే చెప్పెను. అంతట రక్తాక్షుఁడు లేచి మ్రొక్కి యుపమర్దున కట్లనియె. పగవాఁడు హీనుఁడగు హీనవృత్తిచేత నణఁగి యుండి తనకు బలము గలిగినప్పుడు విజృంభించును. తనకుఁ గీడు చేసినట్టువంటి దుష్టునిచేతఁ జెప్పఁబడిన వినయవాక్యములకు మెచ్చుకొను వెఱ్ఱివాఁడు గలఁడా? ఈ చిరంజీవి మునుపు ప్రత్యక్షముగా నీ కపకారము చేసినవాఁడు. ఇప్పుడు మంచిమాటలాడఁగానే వీని నమ్మఁ గూడదు. చేసినదోషము ప్రత్యక్షముగా నుండఁగా మూఢుఁడు మంచిమాటలచేత సంతోషించును.

అని యనేకవిధములుగా రక్తాక్షుఁడు చెప్పిన నుపమర్దుఁడు రక్తాక్షుఁడము యతనిమాటలాదరింపక చిరంజీవినిఁ బిలుచుకొని తననివాసమునకుఁ బోయి యతనిచేత నత్యంతగౌరవంబునం గొలిపించుకొనుచుండెను. ఒక్కనాఁడు చిరంజీవివచ్చి యుపమర్దునకు మ్రొక్కి యయ్యా నీపగవాఁడు నీగుణములు తనయెదుట నేను స్తోత్రముచేసినందున మిక్కిలికోపముతో నన్నవమానపఱిచెను. ప్రాణముతీపని నేను బ్రదికియుండ నొల్లను. అవమానపడ్డ యీ బ్రదుకేల? నేనగ్నిలోఁ బ్రవేశించి దేహముచాలించెదను. నాకెవ్వరు నడ్డము రాకుండుం డని పలికెను. చిరంజీవి చెప్పిన మాటలన్నియు విని రక్తాక్షుఁడు వానిమనసు తెలిసికొందమని వానిం జూచి నీవు చచ్చి యేమి చేయఁగలవని యడిగెను.

తాను జచ్చి గ్రుడ్లగూబగాఁ బుట్టి శీఘ్రముగాఁ గాకులను నెల్లఁ బగ తీఱునట్లుగాఁ బట్టి చంపుదు నని చిరంజీవి చెప్పెను. ఈవిధముగాఁ జేయుట నీకు నసాధ్యము. తొల్లి సూర్యుని, మేఘుని, వాయువును, పర్వతమును, భర్తగా నుద్దేశించి యొక మూషిక తనజన్మమునే యెత్తెను గాని యుత్కృష్టజన్మము నెత్తనేరదయ్యె నని రక్తాక్షుఁడు పలికెను. అది యెట్లని చిరంజీవి యడిగెను. రక్తాక్షుం డిట్లనియె.

ఒకమునీశ్వరుఁడు పుణ్యనదులలో స్నానము చేయుచు నొకనాఁడు గంగానదిలో స్నానముచేసి సూర్యోదయసమయమున నర్ఘ్యజలములు దోసిటఁ బట్టుకొని యుండఁగా, నొక డేగ యొకయెలుకను గాళ్లఁ దన్నుకొని యాకాశవీధినిఁ బోవుచుండఁగా నాయెలుక డేగకాళ్లలోనుండి వదలి యాముని దోసిటిలోఁ బడెను. అప్పుడు ముని దయగలవాఁడయి యీయెలుక కన్యక యగుఁగాక యనెను. అనఁగానే యది కన్యక యాయెను. ఆముని యాకన్యకను దనభార్యచేతికి నిచ్చెను. ఆమె దానిం దాను గన్నకూఁతుకంటె నెక్కువమక్కువతోఁ బెంచుచుండఁగా దానికి యౌవనము వచ్చెను. అప్పుడాముని మిక్కిలి మనోహరమైన యాకారము గల యాచిన్నదానిం జూచి యిది పెండ్లి గాకమునుపు రజస్వల యయిన వృషలి యనఁబడును. దీనిం బెండ్లియాడినవాఁడు వృషలీపతి యనఁబడును. కాఁబట్టి తగినవరుని విచారించి త్వరగా దీనికిఁ బెండ్లి చేయవలె నని యెంచి మూఁడులోకములను బ్రకాశింపఁ జేయుచున్న సూర్యునిం దలఁచి మ్రొక్కిన సూర్యుండు ప్రసన్నుండయి మునియెదుట నిలిచి నీయభీప్సిత మేమియని యడిగెను.

అయ్యా ! యీరూపవతి యైనచిన్నదానిం బెండ్లియాడుటకు మనుష్యు లర్హులు గా రని వివాహము చేయక నిలిపి యున్నాను. దీని భార్యగా మీరు పరిగ్రహింపవలెను. ఇది నాకోరిక యని ముని చెప్పెను. అంత నాసూర్యుఁడు దాని మూషికఁగా నెఱింగి పరిహరింపఁ దలఁచి, యో తపోధనావారిదుఁడు నా ప్రకాశమును మఱుఁగుపఱుచు చున్నాఁడు. కాఁబట్టి యతఁడు నాకంటె బలవంతుఁడు. అతనికి నీకన్య నిచ్చి పెండ్లి చేసినఁ దగి యుండు ననెను. అతనిం బ్రార్థించిన, మేఘుఁడు ప్రత్యక్ష మయి నన్నేల రప్పించితి వని యడగెను. అయ్యా యీ చిన్నది నాకొమార్తె, దీని నీవు భార్యఁగాఁ బరిగ్రహింప వలె నని యతఁడు కన్యకను జూపెను. చూడఁగానే మేఘుఁడు చిఱునవ్వు నవ్వుచు మునిం జూచి, వాయువు నన్నుఁ జెదరఁ గొట్టుచున్నాఁడు, కాఁబట్టి వాయువు నాకంటె బలవంతుఁడు, నీకూఁతు నతని కిచ్చినఁ దగియుండును గాని యితరుల కిచ్చుట తగునా యని మృదువు లయిన పలుకులచేత నతని సమ్మతి పఱిచి పోయెను. పిమ్మట నాముని వాయుదేవు నారాధించి తలంచిన నతండును జనుదెంచి యెదుట నిలిచి నన్నుఁ దలఁచినకార్యమేమి యని యడిగెను. ఆముని యాకన్యక నతనికిఁ జూపి యిది నాకూఁతురు, దీని మిక్కిలి గారాబముగాఁ బెంచితిని, తగినవరున కిచ్చి వివాహము చేయవలయు నని తలంపు పుట్టి నిన్నుఁ బ్రార్థించితిని, ఈకన్యకను మనుష్యుల కిచ్చుటకు నాకు సమ్మతిలేదు, జగత్ప్రాణుండ వయిననీకు నియ్యం దలంచితిని, నీవు దయచేసి యీకన్యకం బెండ్లియాడ వలయును, అందువల్ల నేను కృతార్థుఁడ నగుదు నని చెప్పెను. ఆమాట

హాయుదేవుఁడు విని, నే నందఱిని జలింపఁ జేయుచున్నాను, పర్వతమును మాత్రము కదలింప లేను, నాకంటెఁ బర్వతము నకు బల మధికము, కాఁబట్టి నీకూఁతును బర్వతమున కిచ్చి పెండ్లిచేసిన మిగుల మంచి దని చెప్పి యతనిచేత సెలవు దీసి కొని తనస్థానమునకుఁ బోయెను. అటుతర్వాతి నాముని పర్వత ములలో శ్రేష్ఠమైన మేరుపర్వతము నారాధింపఁగానే, హేమాద్రి దివ్యరూపము ధరియించి మునియెదుట నిలిచి నావల్ల నీకుం గావలసిన ప్రయోజన మేమి యని యడిగెను. రూపవతి యగు నాకూఁతు యౌవనశాలి వయి సుందరా కారుఁడ వయిన నీ కిచ్చి పెండ్లిచేయవలె నని ప్రార్థించితిని, అని ముని పలికెను. రత్నసాను వామాట విని, యోముని శ్రేష్ఠుఁడా మూషికము చూచినఁ గొంచెముగా నగపడు చున్నది దానిశక్తి యేమని చెప్పవచ్చును. మిక్కిలి దృఢము లుగా నుండెడు పర్వతములను సహితము త్రవ్వి బొక్కలు చేయుచున్నది. కాఁబట్టి నాకంటె మూషికము బలశాలి, నీకూఁతును మూషికమున కిచ్చి పెండ్లిచేసిన జక్కఁగా నుండు నని చెప్పి తనస్థానమునకుఁ బోయెను. తదనంతర మాఋషి యా చిన్నదాని వెంటఁ బెట్టుకొని ఋష్యాశ్రమములకుఁ బోయి యాచిన్నదానిఁ బెండ్లి చేసికొం డని బ్రాహ్మణోత్త ములతోఁ జెప్పఁగా, నింతచక్కనిచిన్నది మాయింట నుండఁ దగదు, రాజుల కయినఁ దగినదిగా నుండును, మాకు వలదు, మీరు పొం డని బ్రాహ్మణోత్తములు చెప్పిరి. అంతట నా ఋషి మిగుల సిగ్గుపడి తనయింటికి వచ్చి యిది పెండ్లి గాక మునుపు రజస్వల యయిన ధర్మహాని యవును, కాఁబట్టి పూర్వ

రూపము ధరించి సంచరించుచుండఁగా నయిన నది మూషిక యయ్యెను. అప్పుడు ఋషి మగయెలుకం జూచి యాయాఁడెలుకను దానికి నంటఁగట్టి విడిచెను. మునికి సూర్య మేఘవాయు మేరుపర్వతములను బ్రత్యక్షము చేసికొనునంతశక్తి యుండియు దాని యెలుకజన్మమును మాన్పఁ గూడకపోయెను.

అని పలికిన నుపమర్దుఁడు రక్తాక్షుపలుకు లాదరింపక చిరంజీవిం జూచి చేరంబిలిచి యభయం బిచ్చి యోచిరంజీవి నీవు స్వేచ్ఛగా నాయింట నుండు మని యతనికి నాహారము మొదలయినవి యమర్చుటకుఁ దనపరిచారకుల నియోగించి బహుప్రేమ గలిగి యుండెను. అటువెనుక చిరంజీవి కొంత కాలం బుండి శత్రువులకుఁ గలిగిన బలంబును దుర్గస్థానంబులను రహస్యమార్గంబులను దెలిసికొని శత్రువులను నాశనము చేయుట కిది సమయ మని యెంచి యొకనాఁడు ప్రొద్దున నులూకంబులు దేహము మఱచి నిద్రపోవు చుండఁగా, మునుపు గుహచుట్టును బహుళముగ నుంచుటవల్లఁ జేరిన యెరువు కొక్కరించి కొంత ముక్కునం గఱచుకొని కొంత గాళ్లం దన్నుకొని దీసికొనిపోయి గుహాద్వారంబులయం దెల్ల నిండ నుంచి ఘూకంబులం బొఱఁజూచి నన్ను నమ్మిన యీ గృష్టకాకులఁ జంపుటవల్ల నాకు దోషము లేదు. శత్రువులను నమ్మింపకయే చంపఁ గూడదు. నన్ను ముఖ్యముగా నమ్మిన మేఘవర్ణునకు హితము చేయవలెను. ఏలినవాఁడు సేవకునికి నేపని చెప్పుచున్నాఁడో యాపని దీర్చవచ్చుట యతనికి ధర్మము. ఇట్టి విషయములఁ బాపపుణ్యములు ప్రభువునకే వచ్చును గాని భృత్యుని కేమినిమిత్తము? మేఘవర్ణున కీసమ

యను తెలియఁజేయవలయునని యెంచి చిర్వన మేఘవర్ణుని యొద్దకుం బోయి యతనికిఁ బ్రణామ మాచరించి, మా పగ సాధించుటకు యుక్తమైన కాలమును గనుపెట్టి నీకుఁ దెలియఁ జేయ వచ్చితిని. ఇఁక నా సమాచార మంతయుఁ జెప్పెదను. ఇప్పుడు మనవారందఱు పుల్లలు తృణములును ముక్కునం గఱచుకొని వచ్చునట్లుగా నియమింపుఁడు, అని చెప్పి తాను మండుచున్న కొఱవి యొకటి నేర్పుతో ముక్కునఁ గఱచు కొని ముందుగా నడచెను. కాకము లన్నియుఁ దృణకాష్ఠములు ముక్కులఁ గఱచుకొని మేఘవర్ణునితోఁ గూడ శత్రువులను గెలుచుటకై వేగితో నాకాశమార్గమున నెగిరి గుడ్లగూబ లున్న గొబ్బవాకిటఁ దృణకాష్ఠములు నిండించెను. చిరంజీవి తనముక్కునఁ గఱచుకొని వచ్చిన కొఱవి తగిలించి తనఱెక్క లతో విసరి మంట మండించెను. తర్వాతఁ బొగలును మంట లును మిక్కిలి యధికమై గుహలోఁ బ్రవేశింపఁగానే, గుడ్ల గూబలు భయభ్రాంతములై దిక్కుదిక్కులకుఁ బరుగెత్తి గుహయందుండి వెళ్లిపోవుటకు నెక్కడను ద్వారము గానక నగుచు చుండఁగా, రక్తాక్షుండను దనస్వామి యయిన యుపమర్ద నొద్దకు వచ్చి చిరంజీవిని జంప రా దని నీవును మంత్రులును జెప్పితిరి. ఇప్పు డీప్రకారముగా ననుభవింపవలసి వచ్చెను. ఇటువంటి పాప మెక్కడ నైనను గలదా! తనకు హితుఁడైన మంత్రియొక్క మాటలను వినని రాజు బంధుమిత్రసహిత ముగా విపత్తును బొందు నని పలికెను. ఉపమర్దుఁడు ఖిన్నుఁ డై ప్రతికూలమైన కాలమునందుఁ బ్రాణులకు ధర్మ మధర్మ ముగాఁ దోఁచును. కాని త్రోవ మంచిత్రోవగా నగపడును.

శత్రువు మిత్రుఁడుగాఁ గనఁబడును. కాఁబట్టి నాకు నీ వెంత హితము చెప్పినను వినక చిరంజీవినిం బరిగ్రహించి యముని దగ్గఱకుఁ బోవుటకు మార్గము చేసికొంటివి. దైవమువల్ల వచ్చినదానికి మన మేమి చేయవచ్చును. పూర్వ మొక యక్షౌహిణితోఁ బాండవబలం బుండఁగా నిశీథవేళలో నశ్వత్థామ యొకఁడే వారిని సంహరించు చుండుసమయమునందు శ్రీకృష్ణస్వామి యక్కడ నుండియును నివారింపం జాలెనా? దైవకృత్యము దప్పింప నెవరిచేతను గాదు అని చెప్పెను. ఇంతలో మంట లధికమైనందున గుడ్లగూబ లన్నియుఁ జచ్చి పోయెను. అప్పుడు కాకులు సంతోషించి నిజనివాసమునకుఁ బోయెను.

అక్కడ మేఘవర్ణుఁడు మహావైభవముతోఁ గొలువై యుండి చిరంజీవిం జూచి యాలింగనము చేసికొని లెస్సగా సమ్మానించి, ఇన్నిదినములు శత్రువులు నమ్మునట్లుగా నేవిధమునఁ గొలిచి యుంటివి, నాకుం జెప్పు మనిన నతం డిట్లనియె. అయ్యా కార్యార్థి యైనవాఁ డొకవేళ వట్టినేలను బండుకొనును, ఒకవేళ మంచి మెత్తని పఱుపులమీఁదఁ బండుకొనును, ఒకవేళఁ గూరగాయలు దినును, ఒకవేళ షడ్రసోపేత మైనశాల్యన్నమును భుజించును, ఒకవేళ బొంత కప్పుకొనును, ఒకవేళ మంచి సన్నబట్టలు గట్టుకొనును, దుఃఖమును సుఖమును మనస్సున నెంచఁడు. అనువుగానివేళ నధికసామర్థ్యము గలవాఁడు సయితము శత్రువుల నైనను సేవించి సమయము వచ్చినప్పుడు శత్రువుల గెలుచును. సకలదిక్కుల నుండెడు రాజులను బరాక్రమముచేత గెలుచునట్టి తమ్ములు గల యుధిష్ఠి

రుఁడు సహింప ననుకూలము గానివేళఁ దనతమ్ములతోఁగూడ సకలకష్టముల ననుభవింప లేదా? మత్స్యదేశాధిపతి యైన విరాటరాజుదగ్గఱ కాషాయవస్త్రములు గట్టుకొని కంకుభట్టను పేరిచే యుధిష్ఠిరుఁ డుండెను. వలలుఁడను పేరిచే వంటలవాఁడై భీముఁడు కాలము గడపెను. పేడియై స్త్రీలకు నాట్యము నేర్పుచు బృహన్నల యను పేరిచే నర్జునుఁడు వర్తించెను. దామగ్రంథి యను పేరిచే నకులుఁ డశ్వశిక్షకుఁ డాయెను. తంత్రీపాలుఁ డను పేరిచే సహదేవుం డాలగాపరిగా నుండెను. తర్వాతఁ గాల మనుకూలించి రాఁగానే దుర్యోధనుఁడు మొదలుగాఁగల శత్రువుల నందఱిని గెలిచి సకలసామ్రాజ్యము ననుభవించిరి. కాఁబట్టి నేను మహాక్షీణదశ చేతను శత్రువులఁ గొలిచి పగ సాధించితిని.

అని చిరంజీవి చెప్పిన మేఘవర్ణుం డాదరంబుగా నతని వీక్షించి శత్రుసాధ్యముగఁ గొంచెమైన శంక లేక ధైర్యముతో నెట్లు వర్తించితివి చెప్పు మనినఁ జిరంజీవి యిట్లనియె. దేవా వినుము, ఉలూకపతి యైనయుపమర్దుని మంత్రులలో రక్తాక్షుం డనువాఁడు నీతిశాస్త్రము చక్కఁగాఁ దెలిసినవాఁడు. సజ్జనులకుఁ బ్రియుఁడు. పరాక్రమము గలవాఁడు. క్రూరము కానినడవడిక గలవాఁడు. సర్వజనులచేత స్తోత్రము చేయఁ బడినవాఁడు. నాకంటె నెక్కువ బుద్ధి బలము గలవాఁడు. నన్నుఁ జంపవలె నని యుపమర్దునితో నెంత చెప్పిన నతఁడు వినక యితరు లైన నీచమంత్రులతో నాలోచించి, శరణాగతులను జంపఁగూడ దని వారు చెప్పఁగా, వారిమాట విని నన్నుఁ దన యింటికిఁ బిలుచుకపోయి యింత తెచ్చుకొనెను. నీ వతి

సమర్థుఁడవు, గావున శత్రువులను గెలిచితివి. తగు సమయము గానప్పుడు శత్రువులకు లొంగియుండి తర్వాత శత్రువులను గెలుచుట మంచిది. మును నొకకృష్ణసర్పము కప్పలను దన వీఁపుం మోపి సమయము వచ్చినప్పు డన్నిటినిం జంపెను.

అనిన మేఘవర్ణుం డక్కథ వినవలెను నాకుం జెప్పుమనినఁ జిరంజీవి యిట్లనియె. మందవిషుఁ డను పేరు గలయొక సర్పమాఁకటిచేతఁ బీడితమై కప్పలు గలయొకకొలనిసమీపమునకుం బోయి జలపాదుం డనుకప్పను జూచి మహాదీనత్వముతో హీనమైన కంఠస్వరమున నిట్లనియె. నాపొట్టకొఱకు నెవ్వరి నడుగకుండ నిదివఱకుఁ గాలము గడపితిని, ఇప్పుడు మీకు భృత్యుఁడనై యుండ దలఁచివచ్చెను. నేనేమిచేయుదును, నన్ను దైవ మీగతికిఁ దెచ్చెను. అనిన మండూకాధీశ్వరుం డగుజలపాదుండు విని, మమ్మిట్లప్పు డాశ్రయించుటకుఁ గారణం బేమి యని యడిగిన, మందవిషుం డిట్లనియె. నిన్న నర్ధరాత్రివేళ నాఁకటిబాధచేత నిట్టట్టు దిరుగుచుండఁగా, నొకబ్రాహ్మణకుమారుఁడు వచ్చి కాలఁక నన్నుఁ ద్రొక్కెను. నే నతన్యుగ్రముగాఁ గఱచితిని. అంతట నతఁడు విష మెక్కి మూర్ఛిల్లఁగా, నాచిన్నవానితండ్రి చూచి మిక్కిలి దిగులుపడి మంత్రవాదులను బిలుచుకొని వచ్చి మంత్రింపించి మందు లిప్పించి యతనిఁ బ్రదికించుకొని నన్ను మనస్సులోఁ దలఁచి, అధికమైనకోపముతోఁ గన్ను లెఱ్ఱచేసికొని తనబంధువులం జూచి నాచిన్నవానిం గఱచిన చెడుపురుగు తనకు నాహారమైనకప్పలను మోసి మిక్కిలి యాఁకటిచేత డస్సి పరుగెత్తలేక యాకప్పలు దయచేసి యిచ్చిన యాహారమును

భక్షించి వానిలో నొకఁడై సంచరింపుఁగాక యని శపించెను. నే నచ్చట సమీపమున నున్న పుట్టలో నుండి యీమాట లన్నియు వింటిని. పిడుగుదెబ్బ నయినను దప్పించుకొన వచ్చును గాని బ్రాహ్మణునిశాపము దప్పించుకొనఁ గూడదు. ఇప్పుడు నీవే దిక్కని వచ్చినాను. దయతో నన్ను దగ్గఱఁ దీసి నీభృత్యునిఁగా నేలి నా కింత యాహార మిచ్చి కాపాడవలెను. మునుపు మా మీ పెద్దలు వివేకము లేనందున మైత్రి సేయ నొల్లక వృథాగాఁ బగలు చేసికొనిరి. వారేమి మూటగట్టుకొని పోయిరి? ఇప్పుడు మీరు నేను మైత్రితోఁ గూడి యుందము. అని చెప్పఁగా మండూకరాజు సంతోషించి యాబిలేశయము వీఁపుమీఁద నెక్కి కూర్చుండఁగా, నతని మంత్రులును వచ్చి తమరాజుతోఁ గూడ దానివీఁపెక్కి కూర్చుండిరి. అంతట మందవిషుఁడు కొంతసేపు తిరిగి యలసినవానివలె మెల్లమెల్లఁగా నడచుచుండెను. జలపాదుఁడు మెల్లమెల్లఁగా నడచెద వేమి యని యడిగెను. ఆహారము లేదు గనుక నడవలేక చిక్కితిని, మీ రియ్యకుండిన నాకాహార మెక్కడిది? ఇప్పుడు నా కేమైన నాహార మిచ్చి రక్షింపక పోయినఁ బ్రాణములు నిలువవు, అని మందవిషుఁడు పలికెను. ఈమాట మండూకరాజు విని పన్నగమునందుఁ గరుణించి, యీకొలనిలో నుండెడు కప్పలను నీకుఁ గావలసినంతవఱకు నాయాజ్ఞమీఁద భక్షించి శీఘ్రముగా వచ్చి నాకు వాహనకార్యము నెఱవేర్పు మని చెప్పెను. మందవిషుఁడు మహాప్రసాదం బని యతని నతనిమంత్రులతో నచ్చట దించి జలమధ్యమునకుఁ బోయి కావలసిన కప్పలను భక్షించి వచ్చి మునుపటివలెనే వాహనకృత్యము చేసెను. ఈప్రకారముగాఁ

కొన్ని దినములకు జలపాదుఁడు దప్పఁ గొలనిలో నుండెడు కప్పల నన్నిటిని భక్షించెను. తర్వాతఁ గొలనఁ గప్పలు లేనందునఁ గడపట జలపాదుని భక్షించి పోవుద నని యతని చెంతకు వచ్చి యతని భక్షించి సర్పము స్వేచ్ఛగాఁ బోయెను. నేను శత్రువుల నాశ్రయించి పగ సాధించితిని. అగ్ని యడవిని దహించునపుడు చెట్ల మొదళ్లు నశింపవు గనుక తిరుగఁ జిగిరించును. అటువలెనే శత్రువులను కొందఱిని నశింపఁజేసి, కొందఱిని నిలిపినఁ గొన్నాళ్లకు వారు తిరుగ బలవంతులై వత్తురు. అగ్నిశేషము, ఋణశేషము, రోగశేషము, శత్రుశేషము, నిలిచియుండెనా నానాటికి వృద్ధిఁబొందును. కాఁబట్టి శత్రుశేషం బుంచఁ గూడదు. నీవు నిశ్శేషముగా శత్రువులను సంహరించిన భాగ్యవంతుఁడవు. రాజు వ్యసనములయందు సక్తుఁడు గాక ప్రజలను సంతోషపెట్టుచుఁ గామక్రోధలోభమోహమదమాత్సర్యములను విసర్జించి, సత్యము, ధర్మము, శౌచము, సహనము, మొదలైన సుగుణములు గలవాఁడై, తన ఛిద్రములు కనఁబడనీయక తన మనుష్యులఛిద్రములు తెలిసికొనుచు, దేశకాలములను గుర్తెఱిఁగి, స్వామి, అమాత్యులు, సుహృదులు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము, అనియెడు సప్తాంగములను రక్షించికొనుచు, మహాధార్మికుఁ డని జనులచే స్తోత్రము చేయఁబడి, తన కీర్తి దిక్కులయందుఁ బ్రకాశింపఁజేసెనా, అతఁడు దేవాంశమువలనఁ బుట్టినవాఁ డని తెలియఁదగ్గది. శూరుఁడు తీక్ష్ణమైన యాయుధములచేత, యుద్ధభూమియందెదిరించిన శత్రువులను మాత్రము సంహరించును గాని, బహుసైన్యములను జంపలేఁడు. మంచి

యుపాయముచేతనైన నరాతులఁ బుత్రమిత్రకళత్రబంధు సహితముగా నశింపఁజేయును. ఏపనికి నుద్యోగించినను దైవమనుకూలించిన నాపని సిద్ధించును. దైవము ప్రతికూలించెనా పురుషప్రయత్నముచేత మాత్రమే సిద్ధింపదు. కాఁబట్టి దైవానుకూల్యము లేనిపురుషప్రయత్నము నిరర్థకము దశరథరాముఁడు తాపసవేషము ధరించెను. బలిచక్రవర్తి బంధింపంబడెను. పాండుపుత్రులు వనవాసము చేసిరి. యాదవులొకరి నొకరు గొట్టుకొని చచ్చిరి. నలమహారాజు సకలకష్టములనుభవించెను. భీష్ముఁడు శరతల్పమునందుఁ బండుకొనెను. నారాయణుఁడు వామనాకారము దాల్చెను. రావణాసురుఁడు కార్తవీర్యార్జునుని పరాక్రమమునకు నోడిఁగి యుండెను. ఈజగంబు సర్వంబును దైవప్రయత్నమువల్ల జరుగుచుండును. మూఢుఁడైనవాఁ డిది తెలిసికొనలేఁడు. బుద్ధిమంతుఁడైన వాఁడు తెలిసికొని స్థిరచిత్తుఁడై యుండును. శాస్త్రముచేత బుద్ధియును, మంచిజలముచేత నేలయును, చంద్రునిచేత రాత్రియును, నీతిచేత దొరతనమును, అలంకరింపంబడును. సూర్యుఁడు చీఁకటిని బోఁగొట్టునట్లు హేమంతఋతువు శరత్కాలమును, కృతఘ్నత్వము సుకృతమును, వివేకము దుఃఖమును, నీతి యాపదను, దుర్నీతి సంపదను, విషాదము సంతోషమును, బోఁగొట్టును. కాఁబట్టి నీతిచేతఁ బ్రజలను బాలించినరాజు సుఖము ననుభవించును. అని చెప్పిన చిరంజీవిపలుకులకు మేఘవర్ణుఁడు సంతోషించి యతనికి నర్ధరాజ్య మిచ్చి, తానును సామ్రాజ్య మనుభవించుచు సుఖంబున నుండెను. అని విష్ణుశర్మ చెప్పినసంధివిగ్రహము విని, రాజనందనులు సంతసిల్లిరి.

---

# లబ్ధనాశము

——:O:——

ఒకమొసలి యొకకోఁతితో స్నేహముచేసి మోసపోయి నట్లు మూఢుఁడైనవాఁడు తనకు దొరకినయర్థము నితరుల మంచిమాటలకు మోసపోయి యజ్ఞానముచే విడిచిపెట్టును. అని విష్ణుశర్మ చెప్పఁగా, రాచకొమారులు విని, మొసలికిం గోఁతికి నెట్లు స్నేహ మాయెను? మొసలి యెట్లు మోస పోయెను? మాకు విశదముగాఁ జెప్పుమనిన, విష్ణుశర్మ యిట్ల నియె. సముద్రతీరమునందు బలవర్ధన మనుపేరు గల యొక కోఁతి గలదు. అది ముసలిదైనందున మఱియొక వానరపతి చేత వెళ్లఁగొట్టఁబడి సిగ్గుచేత నా దేశము విడిచి పోయిపోయి యొకనదీతీరమున మధురఫలం బను మేడిచెట్టు ఫలభరితంబై యుండఁగాఁ జూచి, యచ్చట నిలిచి, దానిపండ్లచేతఁ దనశరీరమును బోషించుకొను చుండెను. ఇవ్విధంబున నుండఁగా, నొకనాఁ డామేడిచెట్టునుండి యొకపండు నీటిలోఁ బడెను. అందువల్ల మనోహరమైనధ్వని యొకటి పుట్టెను. ఆశబ్దమును గోఁతి విని, సహజమైన చపలత్వముచే, మేడిపండ్లు నీటిలోఁ బడునప్పుడు చెవుల కింపైనశబ్దమును జేయుచున్న వని యా పండ్లు కొన్ని రాల్చెను. తదనంతర మచ్చటఁ గ్రింద నున్న యొకమొసలి క్రించ మనుపేరు గలది దైవవశమువలన లోపల నుండి నీళ్లపైకి వచ్చి యాపండ్లు భక్షించెను. తర్వాత మధుర మైన యాహారము దొరకుటవల్లఁ దృప్తిఁ బొంది యాబలవర్ధ నుం డనువానరునితో స్నేహము చేసి యచ్చటనే బహుదినము లుండెను.

అంతట నా మొసలిభార్య పతివిరహమును సహింప లేక పతిని వెదకి వచ్చుటకై యొకదూతిక నంపించెను. ఆదూతిక వెదకుచు వచ్చి వానరమును జూచి శీఘ్రముగాఁ బోయి యమ్మా నీపెనిమిటి మర్కటముతోఁ గూడి క్రీడించుచున్నాఁ డని యున్నవి కొన్నియు లేనివి కొన్నియుం జెప్పెను. పిమ్మట నొకనాఁడు, మకరము కొన్ని మేడిపండ్లు దీసికొని యింటికిఁ బోయెను. అతనిభార్య దూరమునుండి యతనిం జూచి యొడలికిఁ దైలము రాచుకొని చెలికత్తెలు చుట్టును గూర్చుండి యుండఁగాఁ బండుకొని యుండెను. అట్టిభార్యను వీక్షించి మొసలి మిక్కిలి విషాదమును బొంది దీనికి దేహ మేమి, ఏల పండుకొని యున్నది యని దానిచెలికత్తెల నడిగెను. దీనికి నసాధ్య మైనరోగము వచ్చినది, ఇదివఱకుఁ బ్రదికియుండుట యెక్కువ, నిన్నుఁ జూచి ప్రాణములు విడిచెద నని యాశ చేత బ్రదికి యున్నది యని యొకతె చెప్పెను. ఆమాట మొసలి విని దిగులుపడి, నా ప్రాణ మైన నిచ్చి దీనిం బ్రదికింప వలయు నని పలికెను. పిమ్మట సఖి మొసలిం జూచి, నేను వైద్యునిఁ బిలుచుకొనివచ్చి నీభార్యను జూపించితిని, అతఁడు చూచి కోఁతిగుండెకాయ దొరకిన మందు చేసి యిచ్చెదను, ఆమందు వల్ల నిది బ్రదుకును, లేకుండిన బ్రదుక దని చెప్పినాఁ డనెను. అనంతరము క్రకచుఁడు తనలోఁ దా నిట్లని యాలోచన చేసెను. ఇది యేమి కష్టము సంభవించెను. బలివర్ధనుఁడు దప్ప నాకుఁ గోఁతి యెక్కడ లభించును. గుండెకాయ యెక్కడఁ దెత్తును. వానిఁ జంపిన బహుదోషము భార్యను బ్రదికించుట ముఖ్యకార్యము. మిత్రుఁడు మంచిగుణములు

గలవాఁడు. ఇద్దఱిలో భార్య మిత్రునికంటె నధికురాలు. కాఁబట్టి మిత్రునిఁ జంపి భార్యను బ్రదికించుట ధర్మము. అని నిశ్చయించుకొని బలవర్ధనుని సమీపమునకు మెల్లఁగాఁబోయెను. మెల్లఁగా వచ్చుచున్న మొసలిం జూచి నీ వెందునకు మెల్లగాఁ నడచుచున్నా వని బలవర్ధనుం డడిగెను. నీతోఁగూడ బహు దినములు స్నేహము చేసితిని గనుక నిన్ను మాయింటికి నొక సారి యైనను బిలుచుకొని పోకపోతి ననుసంకోచముచేత మెల్లగా నడచుచున్నాను. ఈలోకములోనివారు తమ కొక ప్రయోజనము నుద్దేశించి యొకరిని ప్రేమించుచున్నారు. నీవు ప్రయోజనము నుద్దేశింపకయే దయగలవాఁడవు. అని మొసలి చెప్పెను. ఓయీ! ఇది యొకయుపకారమా! నీతోఁగూడ సంతోషముగా నిచ్చట వాసము చేయుచు రాజ్యము తొలఁగి పోయినందున వచ్చిన దుఃఖమును బోఁగొట్టుచున్నాను. దుఃఖమును భయమును పోఁగొట్టి రక్షించునట్టి శ్రేష్ఠుఁడైన మిత్రుఁడు ప్రీతికి నమ్మకమునకుఁ బాత్రుండు మిత్ర మను నీయక్షరద్వయము నెవఁడు కల్పించినాఁడో వాఁడు మహా పుణ్యాత్ముఁడు అని వానరుఁడు పలికెను. మొసలి యామాటలు విని సంతోషించి నీవు నావీఁపుమీఁద నెక్కి మాయిల్లు చూడ రావలసిన దని చెప్పెను. బలవర్ధనుండు మంచి దని గ్రాహమువీఁపున నెక్కెను. తర్వాత మొసలి బలవర్ధనుని వీఁపున నెక్కించుకొని నడచుచు నిట్లని వితర్కించెను. ఇప్పుడు నేను స్త్రీకార్యము గొప్పది చేసి మిత్రునిఁ జంపుచున్నాను. ఇది మహాదారుణమైనపని నేను నిందవా లయ్యెదను. బంగారము యొక్క గుణములు తెలిసికొనవలెననిన ఒరగంటిమీఁద

నొరసి తెలిసికొనవచ్చును. పురుషునిగుణములు తెలిసికొనవలె ననిన అతని నడవడికవల్లఁ దెలిసికొనవచ్చును. వృషభము యొక్క గుణము తెలిసికొనవలె ననిన, భారము వహింపఁజేసి తెలిసికొనవచ్చును. స్త్రీగుణములు తెలిసికొనవలె ననిన, ఏయుపాయముచేతను నెంతబుద్ధిమంతుఁ డయినను దెలిసికొన లేఁడు. ఇటువంటి స్త్రీనిమిత్తము నేను మిత్రవధ యెట్లు చేయుదును? అని వితర్కించుసమయంబున, బలవర్ధనుం డా మాటలు విని, ఓస్నేహితుఁడా! ఇప్పుడు నీ వేమి చెప్పితివని మొసలి నడిగెను. ఏమి లేదని మొసలి చెప్పెను. అది చెప్ప నందున వానరుఁడు సందేహించి నేనడిగిన మొసలి యేమియును జెప్పకపోయెను. ఇందునకు హేతు వేమి? నేను వీనిమనసు లోనిమాట నాప్రజ్ఞచేతను బయటికిఁ దీసెదను, అని నిశ్చ యించి యోస్నేహితుఁడా! ఇంట మాచెల్లె లయిన నీభార్య సుఖముగా నున్నదా యనెను. నీచెల్లె లసాధ్య మైనవ్యాధిచేతఁ బీడింపఁబడి యున్నది. బ్రదుకుట కష్టమని మొసలి చెప్పెను. వైద్యులకు మాంత్రికులకుఁ జూపించి యావ్యాధి కేమైనను బ్రతిక్రియ చేయింప లేదా? అని వానరుం డడిగెను. వైద్యుల నడిగినఁ గోఁతిగుండెకాయతో మందు చేసి యిచ్చి నఁగాని బ్రదుక దని చెప్పి రని ప్రియురాలివిషయమైన దుఃఖ ముచేతఁ దెలివి లేక మొసలి వానరునికిఁ బ్రత్యుత్తర మిచ్చెను.

వానరుఁ డామాటలు విని, తనప్రాణములు పోయిన వని యెంచుకొని, అయ్యో! వ్యర్థముగాఁ జచ్చిపోతిని, వార్ధ కమునను నింద్రియములను జయింపనివాఁడ నైనందునకు ఫల మనుభవించుచున్నాను. రాగముతోఁ గూడుకొన్నవాఁ

డరణ్యమున బహుకాల మున్నను ఫలము లేదు. ఇంద్రియ నిగ్రహము గలవాఁ డిల్లు వసించి యున్నను దపస్సు సిద్ధించును. రాగము విడిచి వినయశీలుఁడై ధర్మాధర్మము లెఱిఁగి సత్యదయాశౌచములు గలిగినవానికి గృహమే తపోవనము. దండము, కావిగుడ్డలు, తల బోడిచేయించుకొనుట, భిక్ష మెత్తుట, చదువుట, వీనిచేతఁ దపస్సు సిద్ధింపదు. అని తన మనంబునం జింతించి, దైవవశంబున నొక యుపాయంబు దోఁచి మొసలితో నిట్లనియె. ఓస్నేహితుఁడా! నీవు పిచ్చివాని చేసితివి. ఈమాట మునుపే యేల చెప్పక పోయితివి? నాకు మునుపే తెలిసి యుండిన, అమందు నేను గూడనే తీసికొని వత్తును. నేను ముసలివాఁడ నైనందున మోయలేక నాగుండెకాయ యీచెట్టుకొట్టకొనకొమ్మను బెట్టి యున్నాను, ఇప్పుడది తీసికొని పోవుట యుచితము. ధర్మమును, అర్థమును, కామమును, గోరినవారు బ్రాహ్మణుని, రాజును, స్త్రీని, రిక్తహస్తములఁ జూడఁ బోరు. నీవు బుద్ధిహీనుఁడవై యీసంగతి మునుపే నాతోఁ జెప్పనందునఁ గార్యమునకుఁ గొదవ వచ్చెను. అని చెప్పఁగా మొసలి విని మన మిప్పుడు తిరిగిపోయి గుండెకాయఁ దీసికొని వత్తము. దాని చేతనే కదా నాభార్యప్రాణములు రక్షింపఁబడును. అని మేడిచెట్టుచెంతకు వానరునితోఁ గూడఁ దిరిగి వచ్చెను. అప్పుడు వానరము శీఘ్రముగా నాచెట్టుమీఁద నెక్కెను. ఓస్నేహితుఁడా! శీఘ్రముగా గుండెకాయఁ దీసికొని రమ్మని మకరము వానరమును బిలిచెను. నీగుణము నాకుఁ దెలిసినది, ఇంకమీఁద నేను వత్తునా, నేను ముసలికోఁతినిగాని గాడిదను గాను. ముందుగా స్నేహము చేసి

తర్వాత విరోధపడిపోయి తిరుగ వచ్చునట్లైను, నక్కమాటలు విని సింహము దగ్గఱికి వచ్చిన గాడిదవలెనే చెడిపోవుదును. అని వానరము చెప్పెను. అది యెట్లు చెప్పు మని మొసలి యడిగెను. వానర మిట్లనియె.

ఒకవనములో నొకసింహము కలదు. దానికి భృత్యుండుగా నొకనక్క యుండెను. ఒకనాఁడు సింహము మహాదీనత్వముతో నక్కను జూచి, నాకు మహోదరవ్యాధి సంభవించినది. గాడిదచెవులు గుండెకాయయును భక్షించిన, ఆ రోగము కుదురును. ఇంకొకమందుచేత కుదురదు. కాఁబట్టి మహాప్రయత్నముచేత గాడిదను దీసికొని రమ్మని చెప్పెను. ఆమాట విని నక్క మహాప్రసాద మని గార్దభమును బిలుచుటకై పోయి, పట్టణసమీపమున నొకచాకలివాని బక్కగాడిదను జూచి, తనమాటల నేర్పుచేత దాని బేలుపుచ్చి తీసికొని వచ్చి సింహమునకు నప్పగించెను. సింహము దానిఁ బట్టుకొనవలె నని లేవఁగానే యది భయపడి పరుగెత్తెను. తర్వాత సింహము నక్కను జూచి, నాకు దొరకిన ఖరము పరుగెత్తిపోయెను. ఏమి చేయుదు ననెను. నా ప్రజ్ఞాబలముచేత దానిఁ దిరుగఁ బిలుచుకొని వచ్చెదనని చెప్పి, నక్క మరల గార్దభము చెంతకుఁ బోయి యిట్లనియె. నీవు మిక్కిలి పాపము చేసినందున గాడిదవై పుట్టితివి. కాఁబట్టి చాకలవానిమూలుగుడ్డలు మోసిమోసి కృశించి పోవుచున్నావు. లేనియెడ నావలెనే స్వేచ్ఛావిహారముతో సంచరించుచు వనమునం దుండవా? దైవము నాకిచ్చినపగిది నాహారము నీ కియ్యను పోవునా? అని పలికిన సింహము నన్నుఁ జంప వచ్చెను గనుక నేను పరుగెత్తి

వచ్చితి నని గాడిద చెప్పెను. ఆమాట విని నక్క యిట్లనియె. ఓహో! నీకుఁ దెలియక పోయినది. సింహము నిన్నుఁ జంపుటకై లేచినది గాదు. మరే మనిన, నీవు వచ్చినసంగతి యితరములైన సింహములు శార్దూలములు మొదలైన వానికిఁ దెలియఁ జేయుటకై లేచినది. నీ వెప్పుడు వత్తువని యెదురు చూచుచున్నది. నాయేలినవానితోడు సందేహము లేదు. నామాట నమ్మి రమ్ము. నాతోఁగూడ బ్రదికి యున్నమట్టుకు సుఖ మనుభవింపుము. ఇఁకమీఁద నీవే స్నేహితులకు హితము చేయఁబోవుచున్నావు. నీవును నేనును సింహమునకుఁ బ్రధాన భృత్యులమై యుండుదము. వేయిమాట లెందుకు? మనుష్యులలో ధర్మార్థకామములను గోరెడువారికి శుభములు బహు విఘ్నములు గలపిగా నుండును అని చెప్పఁగా ఖరంబు విని నేను నీతోఁగూడ వచ్చెద నని చెప్పెను. అంతట నక్క నీవు భయపడకుము, రా, నన్ను నమ్ము మని చెప్పి బుద్ధిలేని గార్ధభమును దిరుగఁ దీసికొని పోయి సింహమునకు నప్పగించెను. తర్వాత సింహము దానిం బ్రీతిగానే పట్టుకొని చంపి నక్కను జూచి నీవు దుస్తరమైనకార్యము చేసితివి. నీవంటి సమర్థు లీలోకమున లేరు. అని భూషించి నీవు క్షణమాత్రము దీనిఁ గనిపెట్టుకొని యుండుము. నేను స్నానముచేసి నిత్యకర్మము దీర్చుకొని వచ్చి యీయౌషధము భక్షించుచున్నా నని సింహము పోయెను. సింగము పోఁగానే యిది యేమో మహౌషధ మని యెంచి గాడిదచెవులు గుండెకాయ నక్క తానే భక్షించెను. తర్వాత సింహము వచ్చి గాడిదచెవులు గుండెకాయయు నెక్కడఁ బోయె నని యడిగెను. బుద్ధిహీను

నీకుఁ జెవులును గుండెకాయయు నుండునా ? అవి యుండిన వాఁడి క్లైందున కవు నని నక్క ప్రత్యుత్తర మిచ్చెను. కాఁబోలు నని సింహ మూరకుండెను. కాఁబట్టి నేను మొసలి కోఁతిని గాని గాడిదను గానని చెప్పితిని. ఇంక నన్ను వంచింప నీకు శక్యము గాదు నీవు పోయి నీళ్లు ద్రాగుచు నుండవలసి నది యని వానరము చెప్పఁగా విని మొసలి దొరకినదానిని బోఁగొట్టుకొనిపోయెను. అని విష్ణుశర్మ చెప్పిన లబ్ధనాశం బను నాలవతంత్రమును రాచకొమారులు విని మిగుల సంతోషము నొందిరి.



# అసంప్రేక్ష్యకారిత్వము

—:0:—

నిజముఁ గల్లయుం దెలిసికొన లేక క్రోధముచేత సుజనుల కెగ్గు చేసినవాఁడు పామును జంపినటువంటి ముంగిసను వధించిన బ్రాహ్మణునివలెను మహాత్తైన మనోవ్యధనుబొందును.

అని విష్ణుశర్మ చెప్పఁగా రాజపుత్రులు విని ముంగిస పాము నెందునకుఁ జంపెను? ఆముంగిని బ్రాహ్మణుఁ డేల వధించెను? మాకుఁ దెలియఁ జెప్ప వలయు ననిన, విష్ణుశర్మ యిట్లనియె.

గౌడదేశంబున నొకయగ్రహారంబు గలదు. అందు దేవశర్మ యను బ్రాహ్మణుఁడు గలఁడు. ఆయనభార్య యజ్ఞసేన. ఆమె పురాకృతపుణ్యముచేతను గర్భంబు ధరించెను. బ్రాహ్మణుఁ డామెను జూచి మిగుల సంతోషించి అనంతము లైనకోరికలు గోరుచు నో ప్రియులారా! నీగర్భమునం దున్న కొమారుఁడు స్వకుల మెల్ల నుద్ధరింపఁగలవాఁడు మహాభాగ్యవంతుఁ డని చెప్పెను. భార్య పెనిమిటినిఁ జూచి యిటువంటి కోరికలు గోరుట యుక్తము గాదు. అనాగతకార్యములవిషయమై చింత యెవఁడు చేయుచున్నాఁడో వాఁడు సోమశర్మ తండ్రివలె మిక్కిలి విషాదమును బొందును అని పలికెను. అది యెట్లని బ్రాహ్మణుఁ డడిగెను. బ్రాహ్మణునిల్లాలు చెప్పుచున్నది.

విద్యాభ్యాసముఁ జేయుచున్న యొక బ్రాహ్మణకుమారుఁ డొక బ్రాహ్మణుని యింట శ్రాద్ధమునందు నిమంత్రితుఁడై

భోజనముచేసి వచ్చుచుండఁగా మఱియొక బ్రాహ్మణునియింట నతనికిఁ బేలపిండి యిచ్చిరి. అంతనతఁడు సంతోషించి యది కుండలో నుంచి తనయొద్దఁ బెట్టుకొని యొక యరుఁగుమీఁదఁ బండుకొని నిద్రపట్టెడు సమయములో మితిలేని కోరిక లన్నియుఁ గోరసాగెను. ఎట్లనిః ఇప్పుడు నాదగ్గఱఁ బేలపిండి యున్నదిగదా; నేనాపిండిని విక్రయించి పాఁడిమేఁకను గొనియెదను. దానికి రెండుపిల్లలు గలుగును. ఆరెండును రెండేసి పిల్లల నీనును. ఆనాలుగింటికి నెనిమిదిపిల్లలు పుట్టును. కొంత కాలమునకు వేలసంఖ్యలమేఁక లవును. తర్వాత వాని నమ్మి నూఱావులు గొందును. అవి ప్రతిసంవత్సరం బీనుచుండును. కొన్ని సంవత్సరములకు వేలసంఖ్యలు గల యావులును, పెయ్యలును, కోడెలును, దొడ్డినిండి యుండును. కొన్నికోడెల నరకలు గట్టి దున్నించి పంటఁ బండించి యాధాన్యము నమ్ముదును. కొన్నికోడెలను విక్రయింతును. కొన్ని కోడెలకుఁ బెటికెలెత్తించి బేరమాడించి లాభముసంపాదింతును. ఈప్రకారముగా సంపాదించినధనమును జూచి యితండు ధనవంతుఁడని తెలిసికొని నాకుఁ గన్యకనిచ్చెదమని యనేకులు వత్తురు. అప్పుడుకులంబును రూపంబును గుణంబును గలిగిన కన్యకను బెండ్లియాడి దానితోఁ గూడి సంసారము సేయఁగా కుమారుఁడు పుట్టును. వానికి సోమశర్మ యని పేరు పెట్టుదును. వానికిఁ గొన్నినెల లయిన తర్వాత బంగారుమొలగజ్జెలు, మొలత్రాడు, రావిరేక, ముఱుగులు, గొలుసులు, అందియలు మొదలయినసొమ్ములు పెట్టి వాఁ డాటలాడుకొనుచుండు సమయంబున నాభార్య పనితొందరవల్ల వాని నెత్తుకొనకపోవును, నేను గోపగించుకొని యా

కఱ్ఱతో దానిం గొట్టుదును, అని కఱ్ఱ ద్రిప్పి కొట్టెను. ఆదెబ్బ పిండికుండమీఁదఁ దగిలి పిండి చెదరిపోయెను. అప్పు డావడుగు కల గని మేలుకొన్న వానిఁగా నెంచుకొని మిక్కిలి విషాదమును బొందెను. కాఁబట్టి యనాగతకార్యములవిషయమై చింత యెవఁడు చేయుచున్నాఁడో వాఁడు సోమశర్మ తండ్రివలెను మిక్కిలి విషాదమును బొందు నని చెప్పితి నని పలికిన బ్రాహ్మణుఁడు సిగ్గుపడి యూరకుండెను.

తర్వాతఁ గొన్నిదినములకు నీళ్లాడఁ బ్రొద్దులు కాఁగానే యాబ్రాహ్మణస్త్రీ శుభలక్షణములతోఁ గూడుకొన్న పుత్త్రుని గనెను. పిమ్మట నొకపుణ్యదినమున నామె కొడుకును బెనిమిటికి నప్పగించి స్నానము చేయుటకై నదికిఁ బోయెను. ఆమె నదికి స్నానముచేయఁ బోఁగానే, ఆదేశపురాజు నాఁడు పుణ్యదినము గనుక నాయగ్రహారములో నుండెడు బ్రాహ్మణులను దాన మిచ్చుటకై పిలువ నంపించెను. అప్పుడు కొందఱు బాఁపలు పోవుచుండఁగా నీబ్రాహ్మణుఁడు మిగుల విచారగ్రస్తుఁడై భార్య నెందుకుఁ బంపితిని. నేను బోయిన నిప్పుడీ నిసువును రక్షించువా రెవ్వరు? రాజు నన్నెప్పుడు పిలుచునో, యెప్పుడు దాన మిచ్చునో, యెప్పుడు భాగ్యవంతుఁడ నవుదునో, యని కాలము నిరీక్షించుచుండ సమయము వచ్చినప్పుడు పోవుటకు సందర్భింపకపోయె నని చింతించి, బహుదినములనుండి బిడ్డవలెఁ బెంచిన ముంగిని కొడుకుదగ్గఱఁ గావలియుంచి పోయెద నని నిశ్చయించి ముంగిని బిలిచి, నీ విక్కడ నుండి శిశువును గనిపెట్టవలసిన దని సంకేతముగా దానితోఁ జెప్పి ద్వారమున నిలిపి రాజగృహమునకుం బోయెను. బ్రాహ్మ

ణుఁడు రాజగృహమునకుఁ బోఁగానే యొకకృష్ణసర్పము శిశువు చెంతకుం బోవుచుండఁగా ముంగి చూచి సర్పమును బట్టి మెడఁ గొఱికి చంపి దేహము తునుకలు తునుకలుగాఁ జేసి వయిచి నెత్తురు దాఁకిననోటితో మునువు తా నున్నచోట వచ్చి నిలిచెను. అక్కడ బ్రాహ్మణుఁడు దానము దీసికొని బిడ్డను దలఁచుకొనుచు నతిత్వరితముగా వచ్చి నెత్తుటినోటితో నున్న ముంగిం జూచి యయ్యో ! నే నేమి చేయుదును. ఇది నాబిడ్డను గొఱికిన దని యెంచుకొని గోఁకటితో ముంగినెత్తి పగులఁగొట్టి చంపెను. బాగుగా విచారింపక చేసిన యాబ్రాహ్మణుఁడు ముంగిని జంపినవెనుక నింటిలోపలికిఁ బోయి, సంతోషముగాఁ బండుకొనియున్న కొడుకును తునకలు తునకలుగాఁ గొఱికివేయఁబడి యున్నపామునుం జూచి శిరంబును బాదుకొనుచు, మందబుద్ధి నైననేను బాగుగా విచారింపక త్వరపడి చేయరానిపని చేసితి నని విలపించు చుండఁగాఁ, భార్య వచ్చి చచ్చి పడియున్న ముంగినిఁ బామును జూచి యిది యేమి యని బ్రాహ్మణు నడిగెను. జరగిన వృత్తాంతము బ్రాహ్మణుఁడు చెప్పెను. అప్పు డతనిభార్య యిట్లనియె. ఎవఁడు లెస్సగా వినక బాగుగాఁ జూడక చక్కగా విచారింపక యొక పని చేయునో వాఁడు భిక్షుకులను జంపిన మంగలవానివలె నాపదఁ బొందును. అని చెప్పఁగా నది యెట్లని బ్రాహ్మణుఁ డడిగెను. అప్పు డానిభార్య యిట్లనియె.

ఒకానొక కోమటిబిడ్డ గలఁడు. వాఁడు పుట్టఁగానే వానితల్లి చనిపోయెను. తర్వాత దాది వానిం బెంచుచుండెను. ఈప్రకారముగా నుండఁగా నాచిన్నవానికి బాల్యము వదలి

పోవుసమయంబున నొకనాఁడు వాఁడు తనదారిద్ర్యమునకై దుఃఖించి తన్ను నిందించుకొని నిట్టూర్పులు విడుచుచు విషాదముతో రాత్రి పరుండి నిద్రపోవుచుండెను. నాఁటిరాత్రి తెల్లవాఱుజామున వానిదుష్కృతము నశించి పోయినందున మంచికల గనెను. ఆకలలో నొకసిద్ధపురుషుఁడువచ్చి నీవెందునకు విషాదమును బొందియున్నావు. ప్రాతఃకాలమునందు క్షౌర మభ్యంగస్నానము మొదలయిన కృత్యములు దీర్చుకొని యుండుము. అప్పుడు ముగ్గురు భిక్షుకులు వత్తురు. వారినిఁ బూజించి భోజనముఁ బెట్టించి తృప్తిఁ బొందించి తర్వాత నిర్దయుఁడ వై వారిముగ్గురిని దుడ్డుకఱ్ఱతో నెత్తిమీఁదఁ గొట్టుము. అటుపిమ్మట వారు ముగ్గురును మూఁడునిధు లవుదురు. ఆనిధుల నుంచుకొని సకలధర్మములు చేయుచుఁ బుత్రపౌత్రాభివృద్ధిగాఁ జిరకాలము బ్రదుకుము. అని యాశీర్వదించి యదృశ్యుఁ డై పోయెను. అంత నాకోమటిచిన్నవాఁడు మేల్కాని మంచికల గనినవాఁడు తిరుగ నిద్రపోఁగూడదు గనుక సూర్యోదయకాలమువఱకు నిద్రపోక కూర్చుండి యుండి సూర్యోదయ మైన తర్వాత దాదినిఁ బిలిచి, నేఁడు మన కొకమేలు గలుగఁబోవుచున్నది. నీవు మనయిల్లు మొదలైనది చక్కఁగా శుద్ధి చేసి నియమవంతురాలవై యుండుము. నేను క్షౌరాభ్యంగములు చేయించుకొని స్నానము చేసి శుచి నై యుండెదను. ఒక మంగలవానిం బిలిపింపుము. అని చెప్పి మంగలవాఁడు రాఁగానే క్షౌరము చేయించుకొని వానిం గొంచెముసేపు నిలువుమని చెప్పి తలంటుస్నానము చేసి మడివస్త్రములు గట్టుకొని శుచి యై యుండెను. అంతరము సిద్ధపురుషుఁడు చెప్పిన ప్రకా

రముగా భిక్షుకులు ముగ్గురు వచ్చిరి. వారిని వైశ్యకుమారుఁడు చూచి పూజించి షడ్రసోపేతముగా భోజనముఁ బెట్టించి వారు తృప్తిఁ బొందినతర్వాత దుడ్డుకఱ్ఱ దీసికొని వారినెత్తిమీఁదఁ గొట్టెను. అప్పుడాముగ్గురు వరాలకుప్పలైరి. అందుకు వాఁడు మిగుల సంతోషించి ధాత్రితోఁగూడ ధనసహితమైనతనయిల్లు ప్రవేశించి మంగలవానికి నూఱువరాలిచ్చి పంపించెను. ఈసంగతిని లెస్సగా విచారింపని మంగలవాఁడది చూచి తనయింటికిఁ బోయి నేనును భిక్షుకులను ముగ్గురినిం జంపి ధనము సంపాదించెద నని మనస్సున నిశ్చయించుకొని భిక్షుకులకు నెదురుచూచుచుండెను. కర్మవశము వల్ల ముగ్గురు భిక్షుకులు వచ్చిరి. మంగలవాఁడు వారినిఁ జూచి సంతోషించి పూజించి తృప్తిగా భోజనము పెట్టించి దుడ్డుకఱ్ఱతోఁ గొట్టి వారినిం జంపెను. అయినను వరాలకుప్పలు దొరకకపోయెను. ఈ సమాచారమును రాజపురుషులు విని మంగలవాని నీడ్చుకొని పోయి రాజుతోఁ జెప్పి రాజాజ్ఞమీఁద వానిఁజంపిరి. కాఁబట్టి యెవఁడు లెస్సగావినక బాగుగాఁ జూడక చక్కఁగా విచారింపక యొకపనిచేయునో వాఁడు భిక్షుకులనుజంపిన మంగలవానివలె నాపదలను బొందునని చెప్పితిని. ఏకార్యమునుగాని త్వరపడిచేయరాదు. త్వరపడిచేసిన యవివేకికి నాపదలు వచ్చుట సిద్ధము. లెస్సగా విమర్శించి చేసిన వివేకికి సంపదలు వచ్చు నని భార్య చెప్పిన విని బ్రాహ్మణుఁడు దాని వివేకవచనంబులకు సంతోషంబును, విచారింపక తాను ముంగి

నిం జంపుటకుఁ బరితాపంబును, నొందిన చిత్తంబుతో సర్వం బును దైవాధీనం బని పలికి తనకొమరుని రాణించుచు భాగ్య యుతుండై సుఖం బుండెను. అని విష్ణుశర్మ చెప్పిన యసం ప్రేక్ష్యకారిత్వ మనెడు నలుగవతంత్రము విని యారాజనందను లపరిమితసంతోషభరితులైరి.

సమాప్తము



గ్యానంద ప్రెస, ఇన్నిసుపేట, రాజమండ్రి.